

వోల్గానదీ తీరంలో మిత్రునికి గోర్కీ గ్రంథం వినిపిస్తున్నట్లు ప్రతిమను
తయారుచేస్తున్న తాతార్ శిల్పకారుడు సద్రీ అఖున్ —టాస్ ఏజన్సీ

# ఆంధ్రపత్రిక

సంవత్సరచందా
రు. 12-0-0
విడిప్రతిక
4 అణాలు

ప్రతి బుధవారము
ప్రకటింపబడును

సంపుటము 44
సంచిక 26
5-3-52

Founder : K. NAGESWARA RAO

ఖర సంవత్సర ఫాల్గుణ శుద్ధ నవమి బుధవారము


## విషయానుక్రమణిక

**1952 మార్చి 5**



# మద్రాస్ డైరీ

న్యూఢిల్లీ నగరానికి ఆత్మ లేదన్నారు పండిట్ నెహ్రూ ఈ మధ్య. (ఆత్మ అంటే భగవద్గీతలో చెప్పబడిన అర్థంలో కాదు పాశ్చాత్యుల *Soul* అనే మాటకు 'ఆత్మ' సరియైన తర్జుమా కాకపోయినా అదే వాడటం పరిపాటి అయింది) న్యూఢిల్లీకి ఆత్మ లేదనటానికి కారణం అక్కడ చారిత్రిక వాతావరణం లేకపోవటమేననీ, ఆ వాతావరణం పాత ఢిల్లీలో ప్రతి మూలకీ సందులోనూ కనిపిస్తుందని ఆయన అన్నారు. చారిత్రిక వాతావరణంతోనే మన నగరాలు 'ఆత్మ' వంతములైతే మనం అదృష్టవంతులమే ఈ సమస్య ఇంత తేలిక కాదు మానవత్వానికి నగరాల్లో జరిగే అవమానం ఇంకెక్కడా జరగదు ప్రస్తుత నాగరికతలో ఎంత పెద్ద నగరమైతే ఈ అవమానం అంత ఎక్కువగా జరుగుతున్నది ఆర్థిక వ్యత్యాసాలు జీవన వ్యత్యాసాలు తీవ్రరూపం ధరించి కనిపిస్తాయి నగరాల్లో, ఆత్మగల మానవుడెవడూ తల ఎత్తుకుని తిరిగే ఆస్కారం వుండదు బస్సు లాగే చోట్ల, కాఫీ హోటళ్ల వద్ద, సినిమా మందిరాలవద్ద మూగే దారుణ రోగగ్రస్తులైన బిచ్చగాళ్లను చూసినప్పుడేగా రోడ్ల ప్రక్కనే సంవత్సరాల తరబడిగా నివసిస్తూ దాంపత్యంనుంచి సమస్తమూ జంతువులవలె బహిరంగంగా జరుపుకునే వారిని చూసినప్పుడూ, "ఏమైంది నీ మానవత్వం? ఎక్కడుంది నీ ఆత్మ?" అని ఎవరో భయంకరంగా వెక్కిరించినట్లు తోస్తుంది. ఒకడిని పోషగిస్తే గాని మరొకడు బాగుపడలేని ఈ నగరాలలో ఆత్మవంతులైన మానవులు కనిపించరు, నిజమైన



మద్రాసుకు గవర్నరుగా రాబోతున్న శ్రీ ప్రకాశ.

మానవ సంబంధాలు కనిపించవు ఆధునిక నాగరికత ఎదుర్కొంటున్న ప్రధాన సమస్య ఇదే

* * *

అమెరికన్ రాయబారి మిస్టర్ చెస్టర్ బౌల్సు క్రిందటి నెల 25 న బొంబాయిలో పత్రికా విలేఖరులతో ప్రసంగిస్తూ "ఆర్థికంగా పతనం కాకుండా వుండేటందుకే అమెరికా ఆయుధ నిర్మాణ కార్యక్రమం

సీలుఆన్సరు
మద్రాసు
ప్రీమియర్‌బాక్సుకీలో

బహుమతి రూ 10,000

MURALI CROSS WORDS
మురళీ,1,2,కూపనులు
GOVT REGD NO 1894

ముగింపుతేది
21-3-52

వరుస 1కి
నాలుగు
అణాలు

మొదటి బహుమతి రూ.7000 MURALI ఇతర బహుమతి రూ.3,000

## Closing Date 21-3-52 (Subject to Rules and Conditions.)

| | | జవాబులు 1 | 2 |
|---|---|---|---|
| 1 | పోటీదారుల కందరికిని మురళి క్రాసువర్డ్సు...చూపించును | బహుమానము | అభిమానము |
| 2 | దీనిని వశపరచుకొనుటలో మానవు డేమి చేయుటకైనను జంకడు | శ్రీ | ఠీ |
| 3 | ఆచార సంపన్నుడయినవానికి దీనిపై అభిమతము మెండు | వ్రతము | మతము |
| 4 | ఆదాయము లేనివారు యితరుల...ని గుర్తింతురు | బలిమి | కలిమి |
| 5 | సమయస్ఫూర్తి లేనివారు కార్యముల......... | వదరుదురు | వదలుదురు |
| 6 | దీనితో ప్రవర్తించువారు కష్టములపాలైనను కడకు చెడరు | భీతి | నీతి |
| 7 | నేటి సినిమా తారలకు చాలామందికి దీని నవసరము తక్కువయని సినిమాకుపోవు నలవాటు గల ప్రతివారు గ్రహించును | గానము | మానము |
| 8 | వేశ్య వలలో చిక్కుకొనినయెడల...కొగలదు | మోసము | నాశము |
| 9 | ఆడవారి కిది అలంకారము నిచ్చును | కుచము | కచము |
| 10 | ఇది చేయదలచినవారు డబ్బుకై ముందు జాగ్రత పడాలి | సంచారము | సంహారము |
| 11 | ఇది కొంతిమందిని బుద్ధిహీనులుగా చేయును | తాపము | కోపము |
| 12 | కొన్ని సమయములందు కొందరికి...గడపుట మిక్కిలి కష్టమనిపించును | పగలు | రేయి |
| 13 | భారతీయ ప్రముఖ నటులలో......ఒక డంటారు హెచ్చుమంది. | రాజకపూర్ | దిలీప్‌కుమార్ |

మీ జవాబులు ఈ ఇండ్లయందు 1. 2 మూలముగా పూర్తి చేయుడు

1
2
3
4
5
6
7
8
9
10
11
12
13

పైనుండి క్రిందవరకు జవాబులవరుస 1కి 4 అణాలు మాత్రం రూపాయికి 5 వరుసలు పూర్తిచేయుడు

6 వ. పోటీ సీలు ఆన్సరు
1 2 1 2 1 2 1 2 1 1 1
మా కూపనులను సేకరించిపంపు కలెక్టర్లు ప్రతి పూరియందును కావలయును.
వివరములకు విడువ అడ్రసుకు వ్రాయుడు.

పేరు..........................................................
అడ్రసు........................................................
P. O. or M. O. No.........Col No.........మొత్తము రూ....... మొత్తం వరుసలు...

In entering the Competition I agree to abide by the Competition Rules & Conditions and to accept the Competition Manager's decision as final and legally binding.

**No. 8**

*Address Entries to:* **MURALI CROSSWORDS, PALMANER.** (CHITTOOR DIST)

తలపెట్టిం”దని అన్నట్లు కొన్ని పత్రికలు ప్రకటించాయి. ఆయన ఆ మాట అనలేదని మర్నాడు ఇంకో ప్రకటన వచ్చింది. రాయబారి హోదాలో ఉన్నవాడు తన దేశానికి వ్యతిరేకంగా అంత మాట అంటాడని ఎవరూ అనుకోనక్కర్లేదు. కాని బౌల్స్ ప్రకటనలో సందిగ్ధ విషయాలు లేకపోలేదు. అమెరికా చైనా సెంట్రును గుర్తించలేదని అడిగితే కొరియా యుద్ధమే కారణమన్నాడాయన. కాని కొరియా యుద్ధానికి ముందు ఎందుకు గుర్తించలేదో ఆయన చెప్పలేదు. సామ్రాజ్యవాద వ్యతిరేకినని చెప్పుకుంటున్న అమెరికా ఇండో చైనాలో ఫ్రెంచి వారికెందుకు సహాయం చేస్తోందని అడగ్గా “ఇండో చైనా పరిస్థితి వేరు. అక్కడ కమ్యూనిజమ్ నరికడుతున్నాము” అన్నాడు. “ఇండియాకు స్వాతంత్ర్య పోరాటంలో మేము సహాయం చెయ్యలేదా?” అని కూడా ఆయన అన్నాడు. దీన్నిబట్టి అమెరికా విధానాన్ని ఇలా అర్థం చేసుకోవచ్చు. కమ్యూనిజమ్‌ను అరికట్టవలసి వచ్చినప్పుడు టాంకులనుండి ఆటం బాంబులవరకూ ఎంత ఆయుధ సహాయమైనా అమెరికా తనంతట తాను ముందుకు వచ్చి చేస్తుంది. సామ్రాజ్యవాదాన్నెదుర్కోవలసి వస్తే ఇదివరకు ఇండియాకు చేసినట్లు, ఇప్పుడు ట్యునిషియా మొరాకోలకు చేస్తున్నట్లు — “నైతిక” సహాయం మాత్రం చేస్తుంది.

* * *

మన దేశంలో సోషలిస్టు పార్టీవారు తమ పార్టీకి ఒక ప్రత్యేక వ్యక్తిత్వాన్ని సృష్టించటానికై ప్రయత్నం చేస్తున్నారు. ముందుముందు వీరి వ్యక్తిత్వం ఏ రూపం ధరిస్తుందో గాని ప్రస్తుతానికి మాత్రం ఈ పార్టీకి కొన్ని ప్రత్యేకతలు కనిపిస్తూనే వున్నాయి. ఓట్లకు తగినసీట్లు రాకపోయినా కాంగ్రెసు తరవాత తమదే పెద్దపార్టీ అనే ఆత్మసంతృప్తి ఒక ప్రత్యేకత నిర్దిష్టమైన కార్యాచరణ విధానం చూపించి ప్రజలను ఉత్తేజపరచలేకపోవటం, పండిట్ నెహ్రూ విదేశాంగ విధానం నుంచి మంత్రివర్గాల నిర్మాణం వరకూ ప్రతి విషయం మీద ‘నెగటివ్’ దృక్పథం ప్రదర్శించటం ఈ పార్టీకి గల ఇంకో ప్రత్యేకత. ఇలాంటి ప్రత్యేకతలు ఇంకా వున్నాయి. అసలు చిక్కేమిటంటే, ఆలోచనాశూరులైన వారంతా సోషలిస్టు పార్టీకి పట్టుకొమ్మలుగా నిలబడ్డారు. సామాన్య ప్రజలను తమవైపు తిప్పుకోవాలంటే ఏ పార్టీ వారయినా ప్రజలలో ప్రజలుగా పని చెయ్యగలగాలి. కేవలం ఆలోచనాశూరులైన వారు ప్రారంభించిన ఏ ఉద్యమమూ ప్రజల దాకా చేరలేకపోవటానికి ఇదే ముఖ్య కారణం: మేధావులకు పామరులభాష, పామరులకు మేధావుల భాష అర్థంకావు.

* * *

విజయా వారి “పెళ్లి చేసి చూడు” చిత్రం ప్రేక్షకులలో అన్ని తరగతుల వారిని ఆకర్షించే చిత్రాలలో ఒకటి. ఇతివృత్తం పాతదైనా అప్రస్తుతమైనది కాదు. వ్యంగ్యంతో కూడిన హాస్యం ద్వారా పాత ఇతివృత్తానికే క్రొత్త రూపం ఇవ్వబడింది. పాత్ర చిత్రణంలోను, హాస్యమయమైన దృశ్యాన్ని హఠాత్తుగా కరుణాపూరితమైన సన్నివేశంగా మార్చగలగటంలోను, మాటల సహాయం లేకుండా ఒక సన్నివేశాన్ని మనస్సుపై గంభీరంగా ముద్రించగలగటంలోను, ఏ సెంటిమెంట్‌ను ఎంత పరిమితివరకూ పొడిగించాలో అంతవరకూ పొడిగించి దృశ్యంమార్చి వెయ్యటంలోను డైరెక్టర్ ప్రతిభ స్పష్టంగా కనబడుతోంది. ‘అమ్మడి’ పెళ్లి భగ్నమైన తరవాత, కలకలలాడే పెళ్లి పందిరి ఒక్కసారిగా బోసిపోయిన మెడలాగ శూన్యంగా కనిపిస్తుంది; ‘వియ్యన్న’ వెళ్లిపోతానని చెప్పటానికి వచ్చి మాటరాక ప్రతి గదిలోకి శూన్యంగా చూసి వెళ్లిపోతాడు. ‘అమ్మడు’ బావిలో దూకబోయి తల్లి అడ్డంవచ్చినప్పుడు “అమ్మా” అని మాత్రం అని తల్లిపై వాలిపోతుంది. ఈ దృశ్యాలన్నీ హృదయాలను కదిలించేవే. చిత్రంలో ప్రేక్షకునితో సాన్నిహిత్యం ఏర్పరచుకోని పాత్రలు. మనస్సుపై ముద్ర వెయ్యని పాత్రలు లేవు. అయినా ఇది లోపాలు లేని చిత్రం మటుకు కాదు. అనవసరమైనవి, నమ్మటానికి వీల్లేనివి సన్నివేశాలు చాలా వున్నాయి. చిత్రం పొడుగు తగ్గిస్తే ఈ లోపాలు చాలవరకు సర్దుకునేవి.

—సవ్యసాచి—

# ముందుచూపు

"న్యుంచున్న పాటున రమ్మనమన్నావని వచ్చాడెందుకే సుందరం? అంతా కులాసాగానే వున్నారుకదా?"—. అంటూ బండి దిగుతూనే చెల్లెల్ని ప్రశ్నించాడు శేషాచలం.

"ఏముంది—'స్కూళ్లు తెరచి పది రోజులైంది. హైక్లాసులో జేరాలి నాన్నా' అంటూ సుందరం గోల చేస్తున్నా వినిపించుకోవడం లేదు సరిగదా 'నీ మొఖానికింక చదువు చెప్పించేదిలేదని వాడి మీదా నా మీదా కారాలూ మిరియాలూ నూరుతున్నారు మీ బావ.. అంచేత నువ్వువచ్చి చెబితే నీ మాటయినా విని వాణ్ణి బళ్లోజేరిపిస్తారేమోననే ఆశతో కుర్రాడి గోల చూడలేక నీకు కబురు చేశాను"—అంది లక్ష్మీకాంతం అన్నగారికి మంచి నీళ్ల గ్లాసు అందిస్తూ.

"వున్న వక్కడికీ జీతం కట్టేందుకేమంత దుంగలూ దూలాలూ మోస్తున్నాడని చదువు మానిపించాడు బావ?—అసలేం జరిగింది?"—

"ఏం జరిగిందంటే చెప్పేందుకు మాత్రం ఏముంది!—సుందరం అత్తవారంటే నాకు మాత్రం అసంతుష్టి కల్గలేదూ?—కల్గినా భగవంతుడు చేసిందానికి మనమేం చేయగలమని తృప్తిపడే వూరుకున్నాను... అయినా మనకెంత రుణముందో అంతేగాని వాళ్లది మనకు రా లేదనిఎంత బాధ పడినా ప్రయోజనమేముందో చెప్పు?—యింతకీ సుందరమేంజేశాడని ఆ వంక మీద వీడి చదువు మానిపించాలి?"—

"వియ్యాలవారితో తగాదాపడ్డారా?"—

"తగాదా ఏమీ లేదు."

"దెబ్బలాటేం జరుగలేదంటావు. వాళ్ల మీద కోపం వచ్చి సుందరం చదువుకు స్వస్తి చెప్పించాడంటావు, నీ మాట ఒక్కటీ కూడ అర్థం కావటం లేదు కాంతం!"—

"అర్థమయేందుకేముందన్నయ్యా. మూడేళ్ల క్రితం సుందరానికా సంబంధం చేసినప్పుడు నువ్వూ వున్నావుగా?"—

"అవుననుకో—"

కొడుకు బాగుకోసం ముందు చూపుతో బోలెడు ఆస్తివచ్చే సంబంధంచూసి మరీ పెళ్లి చేశాడు తండ్రి. కాని కొడుకు ముఖాన ఆ గీత ఉండాలి కదా!

"ఒక్కర్తే పిల్లనీ, ఆ పిల్ల తర్వాత పదకొండేళ్లయినా తిరిగి సంతానం కల్గలేదని ఎరుగుదువుగా?"—

"అహ!—వాళ్లకు పదెకరాల పొలం—సుక్షేత్రమయింది—వుందనికూడా తెలుసు"

"సరే—మా వియ్యపురాలికి పెళ్లయిన ఎన్నో సంవత్సరాలకుగాని మా కోడలు పుట్టలేదని వినే వుంటావు."—

"అవును...సుందరం పెళ్లినాటికామెకు కొంచెం యించుమించు వడిమళ్లిపోయివుండడంచేత వాళ్లకింక సంతానం కల్గబోదని కూడా అనుకున్నాం"—

"అంచేత వాళ్లకున్న ఆ పదెకరాల పొలమూ మన కోడలికి సంక్రమిస్తుందని ఉద్దేశపడి' వేలకువేలు కట్నాలిస్తామని వచ్చిన సంబంధాలన్నిటినీ తోసిపారేసి ఈ సంబంధం కుదిర్చారు అందరూ కలిసి"

"అందరూ కలిసంటావేం?—పిల్లబాగుండదని నేనెంత మొత్తుకున్నా 'భార్యా రూపవతీ శత్రుః' అంటూ నువ్వూ మీ ఆయనా మొరాయించలేదూ?—ఆస్తి వస్తుందనేఆశలో పడి మీరిద్దరూ ఉరకలు వేస్తే మధ్య నమ్మల్నేం చేయమంటావు.? కట్నం మీరడగనూ లేదు. వాళ్లిస్తాననూ లేదు. అదీ కాకుండ లాంఛనాలు వగైరాలన్నీ ఏలోటూ లేకుండ దివ్యంగా నడుపుతూనే వున్నారని మొన్నటిదాకా వాళ్లను పొగుడుతూనే వున్నారు మీరిద్దరూను.. ఇంతలో ఏమొచ్చింది?"—

"ఏం రావాలో అదే వచ్చింది.. పదిహేను రోజుల క్రితం ఈ ఉత్తరం వచ్చింది—" అంటూ లక్ష్మీకాంతం మూరులో దాచిన ఉత్తరం తీసుకు వచ్చింది...

శేషాచలం కుతూహలంతో ఉత్తరమందుకుని చదివాడు...అతనికి పట్టలేనంత నవ్వు వచ్చింది.

"మీ వియ్యపురాలికి పద్నాలుగేళ్ల తర్వాత వంశోద్ధారకుడు బయలుదేరాడన్న మాట!—ఎల్లుండా బారసాల?...పాపం!—బావ వాళ్ల ఆస్తిమీద పెట్టుకున్న ఆశలన్నీ నిరాశలై పోయినందుకు విచారంగావుంది"—అన్నాడు. విపరీతంగా వస్తున్న నవ్వును సంబాళించుకునేందుకు ప్రయత్నిస్తూ

"నే నాయనకు మొదట నుంచీ చెబుతూనే వున్నాను. కట్నమిచ్చే మరో

సంబంధమేదైనా చూడమని...నా మాట లెఖా జమా!—ముందెప్పుడో ఒరుగుతుందని ఎగిరిపోయారు. యిప్పుడేమనుకుంటే మాత్రం ప్రయోజనమేముంది?—దిక్కుమాలిన చట్టం—అదేదో—వచ్చిందట!—లేకపోతే సుందరానికి ఎవరు పడితే వాళ్లు ఎగురుకుంటూ వచ్చి పిల్లనిచ్చేవారు"—

"ఛా!—అదేం మాటే!!—తెలివి తక్కువగా మాట్లాడకు...యింతకూ మీరిద్దరూ సుందరానికి తిరిగి పెళ్లి చేసేందుకు కీచులాడుకుని వాడి చదువు చెడకొట్టారన్న మాట!"—

"అబ్బే!—అది కాదురా... మాట వరుసకన్నానంతే.. ఈ ఉత్తరం వచ్చింది. 'ఆడపిల్లయితే నీ వంతుకు సగమైనా వచ్చేదనుకున్నాను నిర్భాగ్యపు సన్యాసి వెధవ మొగపిల్లవాడే కల్గాడు. నిన్నో కుబేరుణ్ణి చేద్దామని ఏ పని తలపెట్టినా అన్నీ విఘాతాలే వస్తున్నాయం'టూ సుందరం మీద నానా హంగామా చేసి చదువు చెప్పించనంటూ భీష్మించారు...యిందులో వీడి పొరపాటుగాని నా తప్పుగాని ఏముందో చెప్పు!"—

"మీ వియ్యాలవారి పొరపాటు మాత్రమేముంది?—అదుగో బావ వస్తున్నట్టుంది.. విషయమేమిటో తెలిసికుని సుందరం చదువు విషయం ఆలోచిద్దాం" అంటూ వాకిట్లో చెప్పులజోడు చప్పుడు విని బావగారికి ఎదురుగా వెళ్లాడు శేషాచలం..

"ఎంతసేపయింది వచ్చి?—అనుకోకుండా వూడిపడ్డావెక్కణ్ణుంచి?—యింటిదగ్గర అంతా కుశలంగా వున్నారా?"—ఎదురైన బావమరదిని చూసి తెల్లపోయి కుదుటపడి ప్రశ్న పరంపరలతో నింపివేస్తూ లోపలికి వచ్చి కుర్చీలో కూలపడ్డాడు రంగశాయి

# శ్రీ టి. జె. మోహన్‌రావు

"మన క్షేమసమాచారాలు తెలిసి చాలా కాలమైంది ఎల్లాగున్నామో ఏమిటోనని ఆదుర్దాపడి చూసిపోదామని వచ్చాడట"—అన్నగారు తన కబురు విని వచ్చానని ఎక్కడ నోరు జారుతాడోననే భయంతో శేషాచలం తరఫున భర్త ప్రశ్నలన్నిటికీ తనే సమాధానమిచ్చి లోపలకు వెళ్లిపోయింది లక్ష్మీకాంతం

"ఎప్పుడు వచ్చావు మామయ్యా?" అంటూ సుందరం లోపల్నుంచి వచ్చాడు"

"యింతక్రితమే వచ్చాను కాని నువ్వీవేళ కాలేజీ ఎగ్గొట్టావేమిటి యింట్లోనుంచి వస్తున్నావు?"— రంగశాయిముఖ వైఖరిని క్రీగంట చూస్తూ మేనల్లుణ్ణి ప్రశ్నించాడు శేషాచలం.

"కాలేజీలో జేరితేగా మానేసేందుకు!" ముఖం ముడుచుకుని సమాధానమిచ్చాడు సుందరం.

"చేరక ఏ గుర్రానికి పళ్లుతోముతున్నావు?" అన్నాడు శేషాచలం.

"అది కాదు మామయ్యా—నాన్న చదువు మానిపించేశారు"—సుందరం ఉక్రోషంగా జవాబిచ్చి బయటకి వెళ్లిపోయాడు.

"ఎందుకని బావా?"—శేషాచలం ఆశ్చర్యంగా ప్రశ్నించాడు రంగశాయిని. "ఎందుకనీ లేదు. స్కూలు ఫైనలు ప్యాసయాడు, వానికా చదువుచాలు. ఆ పైన ఎంత చెప్పించినా డబ్బు దండుగే కాని పెద్ద పెద్ద హోదాలు వెలిగించే యోగం వాడికి లేదు. అంచేత మానిపించాను." ఎర్రపడ్డ ముఖంతో సమాధానమిచ్చాడు రంగశాయి. "మంచి పని చేశావు!—వాడి యోగం నువ్వేం చూశావని నీకీ నిశ్చయం కల్గింది."

"చూడక్కర్లేదు సూచనలు తెలుస్తూనే వుంటాయి. వాడికి మంచి భవిష్యత్తే వుందని నీ అభిప్రాయమయితే యింతలో మునిగిపోయిందేమీ లేదు.—మన దేశంలో ఏ మంత్రో అయేందుకు స్కూలు ఫైనలు కూడా అక్కర్లేదు—కనుక వాడికీ చదువు చాలు." "కాదనటం లేదు. కాని—యిద్దరాడపిల్లలకీ పెళ్లిళ్లు చేసి అత్తవారిళ్లకు పంపావు

(4 ‌-వ పేజీ చూడండి)

నాటిక:

# పల్లెటూరు పార్టీలు

ఇందు వచ్చు పాత్రలు.

1. రామయ్య: గ్రామములోని వొక పార్టీ పెద్ద.
2. నారాయణ: గ్రామములోని రెండవ పార్టీ పెద్ద.
3. సుబ్బయ్య: పేద రైతు.
4. శాంతమ్మ: సుబ్బయ్య భార్య.
5. రంగడు: నారాయణకు నమ్మిన బంటు.

(స్థలం: పల్లెటూరు. సమయం: మధ్యాహ్నం రెండు గంటలు.)

రా: (రామయ్య, సుబ్బయ్య యింటి తలుపు తడ్తుతూ) "సుబ్బయ్యా! సుబ్బయ్యా" (అని పిలుస్తాడు.)

సు: (సుబ్బయ్య లోపలనుండి) ఆఁ. ఆఁ. వస్తున్నా (అంటూ వచ్చి తలుపుతీసి)

> పల్లెటూరి కక్షలలో తల దూరిస్తే ఒక చిక్కు, దూరంగా ఉంటే అందరూ శత్రువులౌతారు! ఇంకెలాగ గ్రామాలలో బ్రతికేది?

వోహో! రామయ్య బావగారా రండి.

శాంతమ్మ: (మంచం వాలుస్తూ) యీ మంచం మీద కూర్చో బాబాయ్.

సు: యేదో పనిమీద వచ్చినట్టున్నారే?

రా: అవును సుబ్బయ్యా, వూళ్ళో సంగతులన్నీ నీకు తెలుస్తూనే వున్నయ్యిగా.

సు: యేదో మీబోటివారు చెబితే వొక మాటవింటమేగాని యితరత్రా నాకేం తెలుస్తున్నయండి.

శాం: మా సంసారము, మా పొట్ట తిప్పలే మాకు సరిపోతా వున్నయ్. అందులోను యీయన వున్నారంటే, వొకళ్ల జోక్యం యేమాత్రం పట్టించుకునే వారు కాదు.

రా: అది చాలా మంచిదమ్మా. యీ కాలంలో అంతా పెత్తందార్లే, పెద్ద చిన్న తారతమ్యం బొత్తిగా లేదు. యెవరికి చెప్పబోయినా తంటాయే కడుపులో చల్ల కదలకుండా యెవరింట్లో వాళ్లు కూర్చున్నంత వుత్తమం కనబడటంలా.

సు: తెల్లారి లేస్తే పది మంది యవహారాలూ చక్క జేసేవాడివి నువ్వే అల్లాగంటే....

రా: వొక్కసారి తల దూర్చినంక తప్పించుకుంటానికి యెవడికి వీలుగావటంలా. నీబోటివాడు వచ్చి "యేం రామయ్య బావా! నా వ్యవహారం కాస్త చక్క జేసి పెడుదువ్" అంటే యెట్లా మాట తీసెయ్యగలను. యిరుక్కున్న వాణ్ణి గురించి ఆలోచించేదే లేదు. కొత్తగా యెవరూ తలదూర్చ గూడదనే నా సలహా.

సు: యెవడు కావాలని యేడుస్తున్నాడులెండి. యింతకు మీరొచ్చిన పనేమిటో తెలపనే లేదు.

రా: ఆఁ, అదే చెప్పబోతున్నా. యిదేం పెద్ద పరమ రహస్యం కాదులే. మీకూ తెలిసే వుంటుందనుకుంటాను. మన వాళ్లంతా పంచాయితీ ప్రసిడెంటుగా వుండమని నన్ను పట్టుపట్టారు. అందుకని మీ యింట్లో వున్న రెండు వోట్లూ నాకే యివ్వమని చెప్పటానికి వచ్చా.

శాం: మీకెవరన్నా ఎదురు నుంచుంటున్నారా?

రా: ఆహా, అందువల్లనే మిమ్మల్ని అడగటం.

సు: మన నారాయణే నంటున్నారు నిజమేనా?

శాం: మీ మేనల్లుడే మీతో పోటీ చేస్తారా?

రా: అవునమ్మా.

శాం: మేనమామ మేనల్లుళ్ల మధ్య పోటీ యేం సబబుగా లేదు బాబాయ్?

రా: సబబుగా వుందని యెవడంటాడమ్మా. వాడికి కళ్లు నెత్తిమీద కొచ్చినై. "యీ సారికి మీ మామగారిని చేసుకోనియ్. పెద్దవాడికి యెదురు నిలవటం మంచిది కాదని" యెంత మంది చెప్పినా వినండే.

సు: మీరైనా తగ్గితే బాగుండేదిగదా.

రా: నాకీపదవులు అధికారాలు కావాలని యెప్పుడూ లేదు. తీరాపనంతా అయిపోయి నన్ను మెంబరుగా తెలియ జేసిన తర్వాత, వాడు నేను అంటూ బయలుదేరె.

శాం. యేదో విధంగా మీరైనా సర్దుబాటు చేసుకుంటే బాగుండేది.

రా: నేనే తగ్గుతానన్నానమ్మా, అంటె మనవాళ్లు నలుగురూ వినందే. "నిన్ను మేమంతా కావాలని, నిలబెట్టినంక మేనల్లుణ్ణి చూచుకుని తగ్గుతావా" అంటూ గోల చేశారు. వాళ్లమాట యెట్లా కాదనను చెప్పు? నన్ను నమ్ముకున్న వాళ్లని నలుగురిని నట్టేట్లో ముంచటం న్యాయమా?

సు: యిప్పుడైనా మనవాళ్లకి నచ్చజెప్పి సర్దుబాటు చేసుకుంటం మంచిదనుకుంటానే!

రా: మా నారాయణకి బొత్తిగా జ్ఞానం లేకుండా పోయింది. యిక ప్రయోజనమేమీ లేదు కాబట్టి మీకున్న వోట్లు రెండూ నాకే యివ్వాలి

శాం: యెద్దూ, యెద్దూ పోట్లాడుకుని లేగల కాళ్లు యిరగదొక్కినట్టు మీరు మీరు పోట్లాడుకుంటం, మాదుంప తెంచటమూను.

రా : వున్న సంగతంతా చెప్పానుగదా? మీరు న్యాయాన్ని విచారించైనా, నాకే యివ్వాలి తప్పదు.

సు : మేనల్లుడు, మేనమామ, యిక మీ మధ్య న్యాయాన్యాయాలను విచారించేది మేమా?

రా : యేం, యెందుకువిచారించకూడదు. న్యాయం ముందు పెద్దేమిటి చిన్నేమిటి.

శాం : మమ్మల్ని పెద్ద యిరుకున పడేశారు.

సు : నారాయణ కూడా వచ్చి యిట్లాగే అడుగుతాడనుకోండి అపుడు మేమేమని చెప్పమ్?

రా : మా వోట్లు రామయ్యకి స్తామని చెప్పండి.

సు : ఆయన మాత్రం మీ మాదిరిగా అనడు?

రా : అంటేమాత్ర మేమయ్యా. ఆయన పెదవాడు. అందులో ఆయంది న్యాయం, కాబట్టి వారికే యిస్తున్నామని చెప్పండి.

సు : చాలా తేలిగ్గా అనేశారు.

రా : భయపడతావేమయ్యా నేనుండగా?

శాం : మీరు మాకు చుట్టమూ గాదు, వారు విరోధము కాదు. మీరెంతో మాకు వారూ అంతే.

రా : నాకూ వాడికి పోలికేమిటమ్మాయ్. నిన్న గాక మొన్న కళ్లు తెరిచిన వాడు, వాడు. పూర్వం నుంచి మీరు మాకు యెట్లా లావాదేవీలున్నై. మీరు అనవసరపు అనుమానాలు మాత్రం పెట్టుకోవద్దు.

సు : మీరిద్దరూ చెరొక పార్టీకి పెద్దలవటం మూలాన కత్తికొడి సందున యిరుక్కున్నట్టుగా వుంది మాబోటి వాళ్ల పని.

రా : కొస్త ముందు వెనకా ఆలోచిస్తే నా మాట కాదనేవారు యీ వూళ్లో యెవ్వరూ వుండరు.

సు : మీరెన్నన్నా చెప్పండి. మేం మీ యిద్దరిలో యెవర్ని కాదనలేకుండా వున్నాం.

శాం : యివ్వాళ తగాదా వచ్చిందని తగాదా మాటలు మాట్లాడితే సరి గాదు. యేనాటికైనా మీరు వొకటి కాకుండా పోతారా? తీరా మధ్యన విరోధ స్తులం మేమవటమెందుకు, చెరొక వోటు యిస్తాం తీసుకోండి.

రా : రెండు పడవలమీద కాళ్లు వేసినందువల్ల ఫలితం లేదు. కొస్త ఆలోచించుకుని మాట్లాడండి.

సు : కరవమంటే కప్పకు కోపం, యిడవమంటే పాముకు కోపం, యెవర్ని కాదన్నా మేం బ్రతకలేం కదా?

రా : అయినవాళ్లు అందులో మొదటి నుంచి కలిసిమెలిసి వున్నవాళ్లు యిట్లా అంటారని నేకల్లో కూడా అనుకోలేదు గదా.

శాం : యిప్పుడు కూడా నిన్నొదిలి పెట్టలేదుగదే బాబాయ్.

రా : వొదిలిపెట్టినంత పని చేస్తున్నారు. వొక్క వోటిచ్చి నన్ను వుద్ధరించేది మటుకు యేముందిలే పరే వెళ్లొస్తాను (వెళ్తూ) మరొకసారి ఆలోచించుకోండి. యేదో ఒకపార్టీని నమ్ముకుంటమే మంచిది అందుకని మీరెండోట్లు నాకే యివ్వటం వుత్తమం. యిక ఆపైన మా యిష్టం. (వెళ్లిపోవును) (సుబ్బయ్యా, శాంతమ్మ వసారాలో నిలబడి వుందురు. యింతలో నారాయణ ప్రవేశించును)

# శ్రీ మలిరెడ్డి వెంకటరంగయ్య

నా : వెదకబోయిన తీర్థం యెదురైనట్లు నా తమ్ముడు మరదలు వాకిట్లోనే కనబడ్డారు

శాం : మరి మీ మహత్యమంటే సామాన్యమైందా?

సు : యే మహత్యమయినా, మాలోనే వుండాలి గాని మీలో యేముంది.

శాం : గుమ్మడికాయల దొంగల్లాగా, బుజాలు తడుముకుంటారే. నేనేం కాదన్నాను గనకనా? నిలబడ్డారేం మరిదిగారు రండి యీ మంచం మీద కూర్చోండి.

నా : (మంచం మీద కూర్చుంటూ) యెట్లైనా చాకచక్యంగల వాళ్లంటే మిమ్మల్నే అనాలి. తడిగుడ్డలతో గొంతులు కోసే రకం కాదు మీది?

శాం : అవును పాపం, మీకేమీ తెలవదు. వెన్న పూస మ్రింగలేరూ, వేలు పెడితే కొరకాలేరు.

నా : చాలా సామెతలు నేర్చావే?

సు : సామెతల కేమొచ్చె గాని మీరేదో పని మీద వచ్చినట్టున్నారే.

నా : యింకొ పనేముందిలే యలక్షను పనే. మీరు నలుగురు నాకు సాయపడాలి.

సు : మాబోటివాళ్లవల్ల యేమవుతుంది. మీ బోటి...

నా : అదేమన్న మాట. నాలుగు పరకలు కలిస్తేనేగా వొక యెంటి. అట్లాగే మనమంతా వొకటిగా వుంటేనే యేదైనా చెయ్యగలం. కాబట్టి మీ వోట్లు రెండు నాకు తప్పకుండా యివ్వాలి. ప్రసిడెంటుగా కూడా నన్నే వుంచాలని మనవాళ్లు చాలా పట్టుదలగా వున్నారు.

శాం : యలక్షనంటూ పెట్టి మా దుంప తెంచుతున్నారు.

నా : ఇందులో మీకేం కష్టం. నా పైన అభిమానముంటేనే ఇవ్వండి.

శాం : పెద్దవాడని అభిమానమైనా లేకుండా మీ మేనమామగారికి యెదురు నిలవటం నాకేమి బాగుండలేదండి.

నా : అన్నీ తెలిసుండే అట్లా మాట్లాడితే నేను నేమి చెప్పను. చిన్నతనాన్నుంచి నన్నెట్లా యేడిపించుకుతిన్నాడో మీకందరకు తెలియని సంగతి కాదు గదా? ఆయన మంచివాడైతే నేను మరొక పార్టీలోనికి వెళ్లవలసిన అవసరమేముంటుంది. యేమన్నాడే ఆయన. వొకవేళ తొందరపడి మాటివ్వలేదుగదా?

సు : యెందుకిస్తాము లెండి అంత తెలివితక్కువగా, మాకువారు యెక్కువేమిటి, మీరు తక్కువేమిటి.

శాం : అందుకనే చెరొక వోటుయిచ్చి వుభయుల్ని సమానంగా చూడదలుచుకున్నాం.

నా : మీకు నేనూ యెక్కువకాదు, ఆయన యెక్కువకాదు మా యిద్దరికంటె యెక్కువైంది న్యాయం.

సు : న్యాయంకూడా సమానంగా కనపడబట్టే అట్లా చేశాం.

నా . అయితే మీరు చాలా పొరపాటు బడ్డారు. ఆయన చేసిన అన్యాయం, యింతింతా. తీరా నన్ను మెంబరుగా నిలబెట్టినతర్వాత ఆయన నాపైకి పోటీకి దిగాడు. నేనైతే ఆపని చేశేవాడినేనా?

కాం : ఆయనా అదే చెపుతున్నాడు.

నా : అబద్ధాలాడటానికి కూడా యేమాత్రం వెనుదియ్యటం లేదన్నమాట.

సు : మీ న్యాయాన్యాయాలని సరిదిద్దే సామంతులం మేం కాదండి.

నా : మీరట్లా అంటే లాభం లేదు. తప్పకుండా మీ వోట్లు నాకిప్పించవలసిందే.

సు. మీరిద్దరూ నేడు అనుకున్నా ఆడుకున్నా వొకనాటికి యేకమవకపోరు. మధ్యన విరోధస్తులమయ్యేది మేమేగా ?

నా : అది కల్లోవార్త. నాకాయన మేనమామ కాదు, నే నాయనకు మేనల్లుణ్ణి కాదు. నాకున్న సంబంధమంతా మీబోటి వాళ్ళ కలుగురితోనే. కాబట్టి మీరా భ్రమలో పడొద్దు.

కాం: మే మెవరిమాట తీశెయ్యగలమండి.

నా : మీరట్లా భయపడవొద్దు నేనుండగా మీకు యెటువంటి భయము వుండదు.

సు : మీరంతగట్టిగా అంటే మే మేమి చెప్పలేము. యీసారికిమాత్రం యిట్లా పోనివ్వండి.

నా : పోనివ్వటానికి వీల్లేదు, మీవోట్లు రెండు నాకు వచ్చితీరాల్సిందే.

కాం : మాటయిపోయింది మరోకరకంగా చెప్పలేము లెండి.

నా : ఇదిగో సుబ్బయ్యా, నా అనుభవ పూర్వకంగా చెబుతున్నాను, యిద్దరు వైద్యుల్ని నమ్ముకుంటం యెన్నడూ లాభం లేదు. యీ కాలం యిలా వుండబోదు. కాస్త ఆలోచించుకోండి.

సు : మే మొకరికి అపకారం చెయ్యబోము. అయినప్పుడు మా కపకారం చేసే వాళ్లు మరెవరుంటారు.

నా : అంతేనంటారు. సరే చూస్తాను. (వెళ్లుచుండగా రంగడు బుజాన గడ్డపలుగుతో యెదురౌతాడు.)

నా : యేరో రంగా! యింత యెండలో బయలుదేరావేరా ?

రం : యింకో కగట్టు మిగిలిపోయిందండి.

నా : గోచిపాతంత పొలానికి ఎంత కాలం వెయ్యాలేం. కర్రగట్టు ?

రం : యివ్వాళ రేపూ అయితే పూర్తి అయిపోతయ్యండి. నేను నాలుగురోజులు చలిజ్వరంపడి లేవలేకపోవటం మూలాన పని ఆగిపోయిందిగాని లేకుంటే యెప్పుడో అయిపోయేది.

నా : అలాగా, నాకు తెలియనే లేదే, కబురుచెయ్యకపోయావ్, డాక్టర్ని తీసుకవచ్చేవాడినిగా ?

రం : యేమంత పెద్ద జ్వరం కాదులెండి

నా : పొలంపని తొందరగా పూర్తిచె. మలక్షుని దగ్గరకొస్తున్నా. యిక మనకి కావలసినంతపని.

రం : అవసరమైతే పొలంపని మానేసి కూడా వస్తాను.

నా : నీవంతవాడివని నాకు తెలుసు. పొలంపని పూర్తిచేసుకునే వద్దుగానిలే. యిక రేపటినుంచి మనకు రాత్రింబగల్లు వూపిరాడదనుకో.

రం : యేంఫర్వాలేదు యెంతలావు పనుండా నా కప్పగించండి.

నా : అయితే మరచిపోయాను. నువ్వీ మధ్య చేలోకి వెళ్ళటం లేదన్నమాట.

రం : లేదండి. చేలోకెళ్లి వారంరోజు లయింది.

నా : సుబ్బన్నకి నీకు సరిహద్దే కాదు. ?

రం : అవునండి. యేంజరిగిందండి ?

నా : యేంజరుగుద్ది. పిల్లి గుడ్డిదయితే ఎలిక యెక్కిరించిందంట. గట్టంతా తెగ కొడిసి వూరుకున్నాడు.

రం : అట్లాగా! నేనీమధ్య చేలోకి వెళ్ళకపోవటంమూలాన బాగా పందు దొరికిందనుకున్నాడు కామాలు.

నా : ఇట్లాటి గాడిదలకి తగినట్టుగా బుద్ధి చెప్పాలి.

రం : చెబుతానా, చెప్పిచూపిస్తానా ?

నాతో తగాదా పెట్టుకోవడమంటే కోరి వితో తలగోక్కుంటమే.

నా : కుక్కకాటుకు చెప్పుదెబ్బ తగిలించిరారా ; చూద్దాం తర్వాత యెవడడ్డం వస్తాడో. (వెళ్లును)

రం : అంతపని చెయ్యకుండా వొదిలి పెడతానా (త్వరగా ముందుకు నడుచుచుండగా సుబ్బయ్య యెదురౌతాడు)

సు : యేం, రంగయ్యా హడావుడిగా వెళ్తున్నావ్ ?

రం : నీబోటి గాడిదలకి బుద్ధి చెప్పటానికి.

సు : (ఆశ్చర్యంతో) ఏమిట్రాఅది, పలకరించినందుకు నామీద పడుతున్నావ్ ?

రం : యేమిటా ; తెలియని నంగనాచిలాగా మాట్లాడుతున్నావేం ? రెండు రోజులపాటు నేను చేలోకి రాకపోతే నానా ఆగంచేస్తావ్ ?

సు : యేమిట్రాఅది పిచ్చపిచ్చగా మాట్లాడుతావ్. నే నేమి...

రం : నువ్వా నేనా పిచ్చపిచ్చగా మాట్లా

(48-వ పేజీ చూడండి)



# వ్యాపార రహస్యం

## శ్రీ చావలి వెంకటశాస్త్రి

> ఉద్యోగాలు చేస్తే మిగిలేదేమిటి? వ్యాపారం చెయ్యాలి. అందుకు వ్యాపారరహస్యం తెలుసుకోవాలని బయలుదేరాడు. తీరా ఆ రహస్యం గ్రహించేసరికి వొణుకుపుట్టుకొచ్చింది.

రామ్మూర్తిగారి చేతుల్లో నాలుగు లిమిటెడ్ కంపెనీ లుండటమూ, ఆయనకూ మా మామయ్యకు బాగా పరిచయం వుండటమూ వచ్చింది చిక్కు. నేను బియ్యే ప్యాసు కాంగానే ఏ వుద్యోగంలో చేరదామా అని అనుకుంటుంటే మా మామయ్య వచ్చి 'నువ్వు వుద్యోగంలో చేరటమేమిటి' అన్నాడు.

'మరి'

'నీబోటివాడు వుద్యోగంలో చేరడమేమిటి? వుద్యోగాల్లో ఏం మిగుల్తుంది. యిప్పుడు చూడరాదూ నీ బావమరదుల పని. నెలకు మూడొందలన్న మాటేగాని ఏం అఘోరిస్తున్నారు! పిల్లలకు కళ్ళకింపయిన బట్టలు కూడా లేవు. యింక పెళ్ళిళ్లు వారుచేసే దేమిటి!'

'కాని ఏం చేస్తాం! అంతే వెధవ జీవితం' అన్నాను.

'అట్లా అనబోకు. ఏమయినా కల్పిస్తే వ్యాపారంలో కల్పించాలి యీ వుద్యోగాలు ఎప్పుడయినా చూసుకోవచ్చు. అందులో చదువుకున్న వాడివి, జాగ్రత్తగా చూసుకుంటే వ్యాపారంకన్నా హాయి వుంటుందా' అన్నాడు.

ఆయన వ్యాపారంవల్ల కలిగే అవకాశాలను చెప్పాడు. కారుక్లీనరుగా ప్రారంభించి బస్సు వోనర్లయిన వాళ్ళనూ, కాఫీ హోటలు సర్వర్లు ప్రొప్రయిటర్లగా అయినవాళ్లనూ నాకు వేలెత్తి చూపించాడు. నాకు ఆయన చెప్పేదాంట్లో నిజం కన్పించింది. మొత్తంమీద ఆయన నన్ను వ్యాపారానికి సులభంగా సుముఖుణ్ణి చేశాడు.

'కాక రామ్మూర్తి వున్నాడు. ఒక్కసారి వెళ్లామంటేసరి' అన్నాడు.

రెండురోజులయిం తర్వాత రామ్మూర్తిగారి దగ్గరి కెళ్లాం. ఆయన ఆఫీసు ఎంతో ముచ్చటగా వుంది. పైన పట్టాభిగారి ఫొటో, టేబిలుమీద రెహానా చిత్రమూ, ఫానూ, ఆఫీసుబాయిలూ నన్ను ఆకర్షించినయి. మామయ్య నన్ను రామ్మూర్తిగారికి పరిచయం చేశాడు. రామ్మూర్తిగారు కూడా చాలా ఆప్యాయంగా మాట్లాడే మనిషి కనక మా మామయ్య వెళ్ళిపోయినా కూడా నాకు ఏమీ కొత్త అన్పించలేదు.

'అస లదేనండీ... మనవాళ్ళలో వున్న జబ్బు. ఎందుకూ యీ బియ్యేలూ, బికాంలు. లక్షణంగా వ్యాపారం అంత హాయి యింకోటుంది చెప్పండీ' అన్నాడు.

'అందుకనే...'

'చాలా సంతోషం. కాస్త మనవాళ్లు పదిమందికీ యిలాంటి భావాలు కల్గితే వుద్యోగానికి పిలిస్తే వచ్చే వాళ్లుకూడా వుండరు' అన్నాడు.

నాకు ఆయన వ్యాపారంలోని శ్రద్ధా, ఆతుర్దా చెప్పారు. ముఖ్యంగా ప్రవేశించే ముందు అభిరుచివున్న వ్యాపారం పెట్టుకోవటం అవసరం అన్నాడు. ఆయన యీ విషయంలో నాకు ఒక సంగతి కూడా చెప్పాడు. మిలిటరీ హోటలు పెట్టవల్సినవాడు మందులషాపు పెట్టే ఎట్లా వుంటుందో హాస్యంగా చెప్పాడు. ఆయన నన్ను మర్నాడు రమ్మనమని చెప్పాడు. యీలోపల నాకు అభిలాష వున్న వ్యాపారం చెప్పమన్నాడు.

నేను మర్నాడు వెళ్ళాను. నన్ను చూసి హాయిగా సిగిరెట్టు తాగుతూ 'రాండి?' అన్నాడు.

ఆయనే 'ఏమన్నా తేల్చారా!' అన్నాడు.

'మీరే చెప్పాలి. అనుభవంవున్న వారు'

'నేను చెప్పానుగా. మీ అభిలాషను పట్టి వుంటుంది. పోనీ స్పెక్యులేషన్...'

'అంటె' అన్నాను.

'ఏమీ లేదు. ధరలు తగ్గినప్పుడు వస్తువులు కొని ధరలు పెరిగిందాకా ఆగి అప్పుడు అమ్మటం. అప్పుడు ఆ మార్జిను అంతా లాభం'

'కాని ధరలు పెరగక తగ్గితే' అన్నాను.

నవ్వుతో 'మీరు నిజంగా వ్యాపారానికి పనికివస్తారు. అంతమాత్రం జాగ్రత్త కలవాళ్లు తప్పకుండా రాణిస్తారు. కాని ఆ ధైర్యం కూడా అవుసరం' అన్నాడు. ఆనాటికి నా పని ముగిసింది.

ఆయనే చెప్పమన్నాడు ఏదయినా అభిలాషవున్న వ్యాపారాన్ని. నేను ఒకరోజున బజారుకు వెళ్లాను. రకరకాల వ్యాపారాలు జరుగుతున్నయి. కిల్లీకొట్ల దగ్గర్నుంచి వెండికొట్ల వరకూ చూశాను మరి అందరూ ఖులాసాగానే నవ్వుతూ కొట్లు తెరుస్తున్నారు. యింటికిపోతూ జేబులు జాగ్రత్తగా చూసుకుంటూ తృప్తిగానే కొట్లు మూస్తున్నారు. నేను ఆలోచిస్తుంటే ఒక నిశ్చయం అంటూకల్గ లేదు.

'పోనీ చేయతగిన వ్యాపారం కాని అటువాలు కాని' అన్నాడు ఆయన ఒకసారి.

'అబ్బ...అవి అంటే నాకు నచ్చవు' అన్నాను.

'పోనీ...మీ యిష్టం. తొందరలేదు. మీకు నచ్చిందే చెప్పండి' అన్నాడు నా నిరుత్సాహాన్ని పసిగట్టినట్టు.

ఒక వారంరోజులయిం తర్వాత ఆయన దగ్గర కెళ్లాను.

'నాకు పత్రిక ఒకటి ప్రెస్సుఒకటి పెట్టాలని వుంది' అన్నాను. నాకు తోచినంతమట్టుకూ యిది సులభమనిపించింది. నేను స్వయంగా రాయలేకపోయినా డబ్బు పంపితే రచనలు పంపించే స్నేహితులున్నారు. అసలు సొంత పెట్టుబడి దమ్మిడీ లేకుండానే నడపబడే పత్రికలున్నాయి. తెలుగుదేశంలో పిల్లలదగ్గర్నుంచీ వృద్ధులవరకూ వయస్సువారిగా వున్నవాళ్ళందరికీ యోగ్యమయే పత్రికలున్నాయి. ఒకటి పిల్లలకూ (ముఖ్యంగా పెండ్లికాని ఆడపిల్లలకూ) యింకొకటి ముసలివాళ్ళకూ (ముఖ్యంగా భార్యలులేనివాళ్ళకూ) పెట్టానంటె బాగా అమ్ముడుపోతయి. ఎందుకంటె యీ వర్గానికి చెందినవాళ్లు ఆంధ్రదేశంలో చాలామంది వున్నారు. పైగా సినిమా ఎడ్వర్టయిజ్మెంట్లు, ఒక పజిలూ ఆరంభించామంటె—ముక్క అనుకున్నప్పుడల్లా నాకు పట్టపగలే వెన్నెలలాగా కనిపించింది.

ఆయన నవ్వి 'అది వ్యాపారం కాదుగాని డబ్బున్నవాళ్లు పెట్టుకోదగ్గ వ్యాపకం' అన్నాడు ఆయన.

'నే నొప్పుకోను'

'మీకు తెలీదు. ఎంతమంది పత్రికలు పెట్టి బాగుపడ్డారో చెప్పు. మనదేశంలో దానిమీదే జీవితాలు సాగించగల అవకాశాలు లేవు. పోతే ప్రెస్సంటావా—ఒడుదుడుకులు లేని పని. అంతకంటె మంచి వుద్యోగం వెతకటమే మంచిదేమో!' అన్నాడు. నేను చిన్నబోయాను. నేను ఎంతో సంతోషంగా చెప్పిన విషయం ఆయన్లో ఆమోదాన్ని పొందలేకపోయిందే అని బాధపడ్డాను.

'పోనీ మీరు చెప్పండి' అన్నాను కష్టంగా.

'చెప్తాగా...... తొందర పడకోకండి. నేను రేపు మద్రాసు వెళ్తున్నాను. రాంగానే చెప్తాను. నువ్వు ఆరంభించవచ్చు' అన్నాడు. నేను శెలవు తీసుకున్నాను. మొత్తంమీద పెద్దచిక్కే వచ్చింది నాకు. ఆయన చెప్పినవి నాకు నచ్చవు. నాకు తోచినవి ఆయనకు నచ్చటం లేదు.

అయితే ఆయన మాటలధోరణి చూస్తే నాకెంతో సహాయం చేయవల్సినవాడి మోస్తరుగా వుంది. మొత్తంమీద చాలాకాలం గడించినా యిద్దరికీ ఆమోదమయిన వ్యాపారం అంటూ దొరకలేదు. నేను ఆయన్ని వదలిపెట్టనూ లేను.

నేను తర్వాత రెండుసార్లు ఆయన ఆఫీసుకు వెళ్లాను. రామ్మూర్తిగారు మద్రాసు నుంచి తిరిగి రాలేదు. యీ రెండుసార్లూ నన్ను ఆఫీసు మేనేజరు మర్యాదగా పల్కరించేవాడు. నవ్వుతూ మాట్లాడేవాడు. బహుశా నేను రామ్మూర్తిగారి బంధువు అని అనుకుంటున్నాడనుకున్నాను.

మూడోసారి వెళ్లాను.

'ఆయన యింకా రాలేదు' అన్నాడు మేనేజరు. నన్ను కూర్చోమన్నాడు. కాఫీకోసం కుర్రాణ్ణి పంపించాడు.

'వద్దండీ' అన్నాను.

'ఫర్వాలేదు'

'ఆయన రావాల్సిందే యీ పాటికి ఎందుకనో ఆలస్యమయింది' అన్నాను.

'పన్లు కొద్దుటండీ ఎన్ని వ్యాపారాలు అందులో వ్యాపకం ఎక్కువ పెట్టుకునే మనిషి' అన్నాడు

నేనేం మాట్లాడాలో నాకు తోచటం లేదు.

కొంచెం సందేహంగా ఆయనే 'పాపం.. చాలాసార్లు తిరుగుతున్నారు' అన్నాడు. అతని మాటల వాలకాన్నిబట్టి నే నెందుకోసం తరచుగా వస్తున్నానో కనుక్కోవల్సిన ఆతుర్దా ఆయన కున్నట్టు కనిపించింది.

'ఏమీ లేదండి...ఆయన నన్ను వ్యాపారంలో ప్రవేశపెట్టా నన్నారు' అన్నాను.

'యింకా ప్రవేశించలేదా!' అన్నాడు.

'యింకా ఏదీ తేలందే' అన్నాను.

'తేలేదేమిటి...వ్యాపారానికి ఒకటని ఏముంది! ఏదయినా వొకటే...యీ పాటికి కిటుకు గ్రహించే వుంటా రనుకున్నాను' అన్నాడు.

'అంటె'

'ఏమీ లేదు. యిప్పుడు మిమ్మల్ని యిన్నాళ్ళనుంచీ ఆయనచుట్టూ తిప్పుకో గల్గుతున్నారా ఆయన, అట్లానే మీరూ మీ చుట్టూ ఒక పదిమందిని తిప్పుకోగలిగితే చాలు. యిందులో రామ్మూర్తిగారు సిద్ధహస్తులు. మీరు ఏ వ్యాపారమయినా విజయంగా చేసుకోవచ్చు. చదువుకున్నవారు మీ కిదో తెలీక...' అన్నాడు సిగిరెట్టు ముట్టిస్తూ.

యీ రహస్యం అర్థమయింది. నిజం కూడా అంతే. నేను యింతమాత్రం—పైగా చదువుకున్నవాడినయి వుండి కూడా—కనుక్కోలేకపోయినందుకు చాలా అభిమానం వేసింది. ఎందుకనో నాలో నాకు నవ్వుపుట్టింది. అవతల మేనేజరు ఏం చెప్తున్నాడో కూడా వినే పరిస్థితిలో లేను. నేను బయట పడ్డాను.

తర్వాత రామ్మూర్తిగారికోసం నేను వెళ్ళనే లేదు. ఆయన మద్రాసునుంచి తిరిగి వచ్చాడో లేదో కూడా తెలీదు.



# ఆలిండియా ఒలింపిక్స్

[ఆలిండియా ఒలింపిక్స్ మద్రాసు కార్పొరేషన్ స్టేడియంలో ఫిబ్రవరి 21 నుంచి 24-వ తేదివరకు జరిగాయి. ఈ సందర్భంలో తీయబడిన కొన్ని ఫోటోలు ఇక్కడ ప్రచురించబడినవి. రెండోది తప్ప మిగిలిన చిత్రాలను తీసినవారు శ్రీ రాఘవరావు, స్టాఫ్ ఫోటోగ్రాఫర్.]




ఒలింపిక్ పందెములలో బరువుఎత్తే పోటీలో పాల్గొన్న ఆంధ్రయోధులు: ఈశ్వరరావు, డి. రాజగోపాలరావు (ఛాంపియన్) జనార్దనరావు.



ఈతపోటీలలో పాల్గొన్న బొంబయిజట్టు డబ్లియు. హాగ్గన్, డాల నజీర్, వి. కోగ్లె.



రనింగ్ బ్రాడ్ జంప్ పోటీలో గెలిచిన ఇంద్రజిత్తుసింగు (పెప్సూ) (దూరం-21 అడుగుల 11½ అంగుళాలు)




400 మీటర్సు పరుగులో గెలిచిన ఇవాన్ జాకొబ్ (మద్రాసు) (49.8 సెకండ్లు)

★ పోటీచేసి గెలవండి! నాలుగు తప్పులవరకు మార్పులేని గ్యారంటీ బహుమతులు !!

# రూ 1,350

రూ 600 రైటు—రూ 300 ఒక తప్పు—రూ 170 రెండు తప్పుల —రూ 130 మూడు తప్పుల—రూ 100 నాలుగు తప్పుల ఆన్సర్లకు—రూ 50 మెరిట్ బహుమతులు !!

## శ్రీ సత్యదేవ్ పజిలు నెం. 23. ★ ముగింపు తేది 22-3-52

కీ సొల్యూషన్ . హైద్రాబాదు మర్కెంటైల్ బ్యాంకిలో డిపోజిట్ చేసితిమి ★ ఫలితములు 26-3-52

★ ప్రవేశరుసుము:— రూపాయికి 2 కూపనులు, రూ 2-0-0 లకు 5 కూపన్లు చొ॥న పంపవలెను.

నిఘంటువు:— శబ్దార్థ చంద్రిక

### అడ్డము:

1. కొందరి యిష్టదైవము
6. ఇతనికి చాలామంది భయపడుతూ వుంటారు.
7. ఒక యుగము
10. దక్షయజ్ఞమును ధ్వంసము చేసినవాడు.
11. ఒక జంతువు.
12. నమ్మకూడని స్త్రీ.
14. స్త్రీలకు "—"పై యెక్కువ ప్రేమ వుంటుంది.
16. పతివ్రత.
17. తెలియని విషయములను తెలియునట్లు వివరముగా చెప్పువాడు.
19. వ్యాయామము.
20 దీనిని జాగ్రత్తగా కాపాడుకొనుట మనందరి కర్తవ్యమైవున్నది.
23. మొగము.
24. ధనము.




### నిలువు:

2. ద్రౌపది.
3. హైద్రాబాదునుండి వెలువడుచున్న ఒక పత్రిక.
4. మనకు అనేక క్షేత్రవిషయములను తెలియజేయునది.
5. యౌవనము గలది.
8. చందమామ.
9 చిలుక.
13. బాధ.
15. పగలు.
16. దీనివలన పనులు సమకూరగలవు.
18. వెల.
20. పార్వతి.
21. పిడికిలి.
22 మేఘము.

★ నిబంధనలు:— ఒక పేరుతో 2 కూపనులకు తక్కువ పంపరాదు. ఎన్ని కూపనులైననూ కాగితములపై వ్రాసి పంపవచ్చు లేదా 6 కానీబిళ్ళలు పంపిన 10 అచ్చుకూపనులు పంపుదుము. కూపనుల రుసుము మనిఆర్డరుద్వారా పంపాలి. M. O. రశీదు కూపనులతో కలిపి పంపాలి. సీలు ఆన్సరు 26-3-52 రంజని వారపత్రికలో ప్రకటించబడును. బహుమతులు పొందినవారి పేర్లు 16-4-52 రంజనిలో ప్రకటించబడును. రంజని (లేక ఫలితములు) కావలసినవారు కూపనుల రుసుంతో 0-2-0 కలిపి పంపాలి. కీ సొల్యూషన్ 5-4-52 ఆంధ్రవార పత్రికలో కూడా ప్రకటించబడును.

**SRI SATYA DEV & Co, (A) Kachiguda, HYDERABAD — (Dn.)**

---

★ మొత్తము 12 పజిల్సుకు విడువకుండ పోటీ చేయదలచినవారికి మిక్కిలి లాభసాటి పద్ధతి

| | | | | | |
|---|---|---|---|---|---|
| రూ 8-0-0 లు పంపి సభ్యులుగా చేరినవారు పజిలు 1 కి 2 కూపనులు చొప్పుననూ— | | | | | |
| రూ 15-0-0 లు | ,, | ,, | ,, | 1 కి 5 ఐదు | ,, |
| రూ 20-0-0 లు | ,, | ,, | ,, | 1 కి 8 ఎనిమిది | ,, |
| రూ 25-0-0 లు | ,, | ,, | ,, | 1 కి 11 పదకొండు | ,, |
| రూ 30-0-0 లు | ,, | ,, | ,, | 1 కి 15 పదిహేను | ,, |

కూపనులు పూర్తిచేసి మొత్తము 12 క్రాస్‌వర్డు పజిల్సుకు పోటీచేసి ప్రతిసెలా ఎన్ని బహుమతులైననూ పొందవచ్చు. పై విధముగా సభ్యులుగా చేరినవారు మొత్తము 12 పజిల్సులో ఏఒక్క దానిలోకూడా బహుమతి పొందలేకపోయిన అట్టి సభ్యులకు వారు పంపిన సభ్యత్వరుసుములో మూడవవంతు డబ్బు తిరిగి యివ్వబడును. పై వివరముల ప్రకారము సభ్యులుగా చేరినవారు తామువంతు కూపనులకు తిరిగి ప్రవేశరుసుముగాని, ఫలితముల జాబితా అచ్చుకూపన్లు వగైరాలకు పోష్టుబిళ్ళలుగాని పంపనవసరములేదు. సభ్యులకు ఎప్పటికప్పుడు అన్ని వివరములు పోష్టుద్వారా పంపుదుము. దీనిలో సభ్యులుగా చేరినవారు ఎప్పుడైననూ నిర్ణయింపబడిన కూపనులకంటె యెక్కువ కూపనులు పంపదలచినయెడల సాధారణ పోటీదారులవలె వారు పంపదలచిన యెక్కువ కూపనులకు రుసుము చెల్లించిపంపవచ్చును.

మా పజిల్సుకు చాలాకాలమునుండి తప్పక పోటీచేయుచున్నవారికి ఏదో సౌకర్యము చూపవలెనను తలంపుతో యీ పద్ధతి ప్రవేశపెట్టబడినది. ఈ పద్ధతిప్రకారము యిక 50 మందికంటె ఎక్కువ సభ్యులు చేర్చుకొనబడరు. గాన చేరదలచినవారు వెంటనే చేరి దీనివలన కలిగే లాభములను, సదవకాశమును పొందవలసినదిగా కోరుచున్నాము. సభ్యత్వరుసుము చేరినవెంటనే రశీదు, రిజిష్టరు నంబరు సభ్యులకు పంపుదుము.

## శ్రీ సత్యదేవ్ అండ్ కో, కాచీగూడా, హైదరాబాదు (దక్కన్)

---

★ పజిలు నెం. 22 కి సొల్యూషన్ · అడ్డము—1 శ్రీ నృసింహుడు, 3. దుర్మార్గము, 5. భోగి, 6. సఖ్యము, 8 మతి, 9. ధ్వంసకుడు, 11. పక్షి, 12. గాయము, 13. మాని, 14. రాముడు, 16. రాజసభ, 17. తులసి, 20. భగవతి, 22. మృతి.

నిలువు:—1. శ్రీవాసము, 2. సింహము, 3. దుగినుడు, 4. మనువు, 7. అసహ్యము, 10. గయ, 11. పని, 13. మాశ్యము, 15. ముకుడు, 16. రాసభము, 18. సిద్ధాంతి, 19. వాక, 21. వడి.

# నేటిపోకడ

పగలు పదిగంటలైంది, హైస్కూలులో పిల్లలందరూ 'బిజీ' గా వెళ్లిపోతున్నారు. ఫస్ట్ బెల్ అయింది. రామం, శర్మ జటాపటా లేసుకుని క్లాస్ రూమ్‌లో కొచ్చారు. రామం శర్మ ప్రాణస్నేహితులు. కాని ఏ విషయంలోనైనా పట్టుదలవస్తే 'ఛల్లాకపుపక్షే.'

ఆనాడు రామం క్లాసులోకి ఒక క్రొత్త కలం తీసుకొచ్చాడు. రామం, శర్మ ఒక బెంచీమీదే కూర్చుంటారు. "కొత్తకలం తీసుకొచ్చా! చూడు"' అని రామం శర్మతో అన్నాడు. "ఎంతో బాగుందిరా. ఎంత?"

"ఫైవ్ రుపీస్."

"గోల్డెన్ ప్లాటిగ్నమ్. పెన్నులీ మోడల్లో వస్తున్నాయన్నమాట కాని ఈపాళీపోతే మరి విడిగా పాళీలు దొరకవేమో."

దానికేం ఆ షాపువాడిదగ్గరే ఉన్నాయిట పాళీలు, విడిగా అమ్ముతాడు"

"ఏషాపు?"

"త్రినాథ్ ఫాన్సీషాపు."

"ఎక్కడుందిరా అది?"

"ఇన్నాళ్లనుంచీ ఈ ఊళ్లోఉంటున్నావ్. ఆ షాపే ఎరగవా?"

"పోనీ కొంచెం చెప్పరా."

"ఇప్పుడూ...ఆ. శ్రీరామచంద్రమూర్తి, ఇన్‌కమ్‌టాక్సు ప్రాక్టీషనర్సు అని ఉంటుందే బోర్డు"

"ఎక్కడరా?"

"నీమొహం నీకేం తెలీదు, పోనీ పరమేశ్వరీ టాకీసెరుగుదువా? అదీ తెలీదా? దాని ప్రక్కన రెండు చిన్నషాపులున్నాయ్."

"ఆఁ"

"అందులో రెండోది"

"ఓహో. క్రొత్తగా మొన్న వినాయక చవితికి. ఓపెన్ చేశాడూ. అదా"

"ఆఁ...ఆఁ...అదే. అదే."

సెకండుబెల్లు కొట్టేరు. ఇంగ్లీషు మాష్టారు వచ్చేశారు.

"ఒకేయ్! రామం ఇంగ్లీషునోట్సు నీ పెన్నుతో రాస్తానురా" అన్నాడుశర్మ.

రామం అంగీకారసూచకంగా తల ఊపేడు.

ఇంగ్లీషుమాష్టారు ఒక్క గుక్కలో అటెండెన్సు పిలిచి నోట్సు ప్రారంభించారు. శర్మ క్రొత్తకలంతోనే రాస్తున్నాడు. ఆ పీరియడంతా నోట్సురాయడమే. అందరికీ చేతులు పీకడం ప్రారంభించింది. శర్మ చేతినిండా చెమటపట్టి కలం అతని చేతినుండి ఎప్పుడు విడుదల అవుదామా అని చూస్తూంది. అతడొకమారు చెయ్యి దులిపాడు. దాంతో కలం క్రింద పడిపోయింది. పాళీపాయింటు విరిగిపోయింది.

> చిన్నపిల్లల చిలిపి తగవులు
> నీటిమీద వ్రాతలంటారు. కాని
> రామాని కంత కట్టుదలేమిటో?

'అరరె...ఎట్లా?'

రామానికి ఎక్కడలేని కోపంవచ్చింది శర్మపైన. కాని మాష్టారున్నారే. అందుకు అప్పటికి కొంచెం తమాయించాడు, శర్మకేమీ పాలుపోలేదు. రామానికి కోపం ముక్కుమీదదుంటుందనిఅతనికి తెలుసును. ఈ సంఘటనతో వారిరువురి స్నేహము పూర్తిగా నశించిందనుకున్నాడు. రామం మొహంకేసి చూడలేకపోయాడు. క్రొత్తకలం మూడిచేసి తన జేబులో పెట్టుకోబోతుండగా రామం గభీమని లాక్కొని మేష్టారుతో చెప్పడానికి ముందునిలబడ్డాడు. మేష్టారు నోట్సుధోరణిలోనే ఉండడం చేత రామాన్ని 'సిట్‌డౌన్' అని కసిరారు, రామానికి మేష్టారుమీద ఒళ్లుమండింది. కాని ఏంచేస్తాడు. "క్షమించు సాయంత్రం నీకు కొత్తపాళీ వేయించి పెడతానులే." అన్నాడు శర్మ.

"ఎంత కొత్తపాళీ వేయించినా ఈ పాళీ సాటి వస్తుందా?"

"అయితే ఏమిటంటావ్?"

"నాకీ పాళీయే కావాలంటాను."

"బాగుందిరోయ్. ఇదిచాలా బాగుంది. పోయినపాళీ ఎలావస్తుంది. చచ్చిన మనిషి బ్రతుకుతాడా?"

"అదివేరేసంగతి, ముందీ పాళీమాట చూడు."

"పాళీసంగతేముంది; నీకు సాయంత్రం కొత్తపాళీ వేయించిపెడతానన్నానుగా"

"అది నాకు పనికిరాదు. సాయంకాలం స్కూలొదిలిపెట్టగానే వచ్చి ఈ సంగతి మా నాన్నగారితో చెబుతాను. నీ సంగతేం బాగులేదు. మొన్నలాగే ఇంగ్లీషునోట్సు చింపేవు. ఏమిరా అంటే మా చెల్లి చింపేసిందన్నావు. ఈవాళ పెన్నుపాళీ విరక్కొట్టేవు. రేపు మరోటి చేస్తావ్."

పీరియడైపోయింది. మేష్టారు వెళ్లిపోయారు. శర్మ మరేమీ మాట్లాడలేదు. రామం మాత్రం గొణుగుతున్నాడు. శర్మ కేసీ చూసి బెంచీమీద ముఖం పెట్టుకుని నవ్వుకుంటున్నాడు తనలో.

తరువాత పీరియడు లెక్కలు. లెక్కల మేష్టారు కూడా వచ్చి వెళ్లిపోయారు. వీరి కలహాకలాపం ఆ పీరియడుకూడా సాగింది. లాంగ్ బెల్ కొట్టేరు. మార్నింగ్ సెక్షను అయిపోయింది. శర్మ మధ్యాహ్నం భోజనంకు ఇంటికి వెళ్లిపోయాడు. రామం కలం పాళీ చూచుకుంటూ విచారిస్తున్నట్లు నటించి ఒకమారు నవ్వుకుని శర్మ వెళ్ళిపోయాక తనుకూడా ఇంటికి దయచేశాడు.

# వ్రాత

"మరి రెండు మెతుకులు తింటున్నా వేమిరా? నీ తిండివరసేమీ బాగా లేదు. అలా తింటే నువ్వెందుకేనా పనికొస్తావా? వచ్చేది వేసవికాలం. అప్పుడసలే నీ ఒళ్లు పాడవుతుంది. మన అప్పారావు డాక్టరు గారి దగ్గరి కెళ్ళి ఏ టానిక్కో తీసుకో మంటే నీకు నిర్లక్ష్యం" అంది శర్మ తల్లి విసినికఱ్ఱ పెట్టి విసురుతూ.

"అవన్నీ ఇప్పుడెందుకమ్మా. మార్చి వెళ్లేదాకా నాకు నిద్ర పట్టదు. తిండి సహించదు," అన్నాడు శర్మ కూడా అన్నం తింటూ.

"ఆరోగ్యం ముఖ్యమా? చదువు ముఖ్యమా? తిండి మానేసి చదవమని ఏ మేష్టరు చెబుతున్నాడో అడుగుదాం పద"

"మజ్జిగ పొయ్యి"

"గుమ్మడికాయ పులుసు అక్కర్లేదా? నీ కిష్టమని మామ్మ వండింది."

"అక్కర్లేదు. వెధవపులుసు. దాన్నిండా తట్టెడు బెల్లం తగలేస్తారు."

"ఎవరిమీద నాయనా ఆకోపం?" అంది తల్లి మజ్జిగపోస్తూ.

"ఏమే! పులుసు పోసుకోలేదా? వీడి తిండి బంగారంగాను. చిన్నప్పుడు గుమ్మడికాయ పులుసంటే పడిదొర్లిపోయేవాడు. మహా...మహా..." అంది శర్మ నాయనమ్మ.

త్వరగా చెయ్యి కడిగేసుకుని బాణంలా వెళ్ళిపోయాడు శర్మ గదిలోకి.

"అంత కంగారుగా ఉన్నా వేమిరా అబ్బాయ్."

"టైము చాలదు నాన్నగారూ. దానికి తోడు ఇవేళ లెక్కల మేష్టారు లాంగ్ బెల్ అయినా మరో లెక్క చెప్పి చేసి ఇంటి కెళ్లమన్నారు."

"అల్లాగా......అన్నట్టు స్కూల్ ఫీ కావాలన్నావుగా. ఇవ్వనా?"

"అక్కర్లేదు లెండి. రేపు చెల్లించొచ్చు" అన్నాడు టైమ్ టేబిలు చూసుకుంటూ.

"తలు పేసుకోండి నే వెళుతున్నాను" అన్నాడు వీధి తలుపు చేరేస్తూ.

* * *

"శేషాచలం మేష్టారు మరీరా. ప్రొద్దుట చూశావా, లాంగ్ బెల్ వినా మరో లెక్క చెయ్యండి అని చంపాదిలిపెట్టాడు" అన్నాడు రాజగోపాల్.

"అవును గాని, నిజమే నేమిట్రా గోపాల్! ఇంగ్లీషులో మన క్లాసుటీచరు చెప్పిన వేమీ పబ్లిక్‌లో పడవంటారు," అన్నాడు లక్ష్మీనారాయణ అదోరకం ముఖం పెట్టి.

"నేనూ విన్నానురా. లాస్ట్ ఇయరు ఆయనదగ్గర ప్రయివేటు చదివిన వాళ్ళందరికి పోయింది. అదీగాక నాలుగుక్కలా చూశాడు; నారాయణ దగ్గరగా జరిగి చెవిలో చెప్పేడు, "మొన్న 'టీచర్సు వెయిటింగ్ రూమ్'లోకి అటెండెన్సు రిజిష్టరుకోసం వెడితే ఆయన 'ఈ వెధవలు బాగుపడేడుస్తారండీ. వీళ్ళకో ముక్క

## "కంచినాదం"

వస్తే నాకేం రాకపోతే నాకేం. నా జీతం మాత్రం దూటబెల్లుల్లా అక్కడ పెట్టమంటాను,' అంటున్నాడురా."

"ఆహాఁ"

"తరువాత మరో విషయం. మొన్న వైజాగ్ నుండి హాఫియర్లీ ఎగ్జామినేషన్ పేపర్లు తెప్పించాను. వాళ్లు ఎక్స్‌పెక్టు చేసినవన్నీ డిఫరెంటుగా ఉన్నాయిరా."

తరువాత కొంచెంసేపు నిశ్శబ్దం.

"మన కొత్త సైన్సు మేష్టారుకి గీరగా ఉంది రోయ్. మొన్న రత్నకుమార్ గాడు నా పెన్సిలు తీసుకున్నాడురా, అది మళ్లీ అడగడానికి వాణ్ణి పిలిచాను. దాంతో నన్ను బెంచిమీద నిలబెట్టాడురా! గర్ల్సు ముందు బెంచిమీద నిలబడితే ఎంత షేమ్‌ఫుల్‌గా ఉంటుందంటావ్! డబుల్ షేమ్ అనుకో."

"నిజమేరా. గర్ల్సుముందు నిన్ను ఇన్‌సల్టు చెయ్యడం చాలా తప్పే."

తరువాత కొంచెంసేపు నిశ్శబ్దం.

"మన తెలుగు మేష్టారు చెప్పినవి 'గస్ షాట్' అనుకో. అవి 'డే అండ్ నైట్' పారాయణ చేసేస్తున్నాను."

"అయితే 'ఫస్టుమార్కు' నీదే నన్నమాట."

"అంత అదృష్టం మనకేలా పడుతుంది బ్రదర్, శర్మ, రామంలాంటి మహామహులుంటే."

ఇంతట్లో ఎవరో వస్తున్నట్టు చప్పుడయింది.

"మాటలో వచ్చావురా శర్మా. ప్రొద్దుట జరిగిన గొడవేమిట్రా. నువ్వు రామం థిక్కెస్టు ఫ్రెండ్సు కదా"

"ఏమిటోరా గోపాల్! మన 'నవీన్' ఏమీ బాగా లేదు, అయినా మా యిద్దరి దెబ్బలాటలు నిజమేమిటికే, నన్నేడిపించటానికి అతను చూస్తాడు. అతన్నేడిపించడానికి నేను చూస్తాను. కాని ఈవాళ మాత్రం అతని వరసచూస్తే అతనీ విషయంలో సీరియస్‌గా ఉన్నట్టు కనిపిస్తోంది."

నాటకం సీనులో నటకుడు ప్రవేశించినట్లు రామం క్లాసులో కొచ్చాడు. అతను వీరి సంభాషణంతా ప్రక్క సెక్షన్‌లో నుంచి వింటూనే ఉన్నాడు. ప్రొద్దుట కూర్చున్నచోటే కూర్చున్నాడు ఏదో ఆలోచించుకుంటూ.

రామం రాగానే ఇంతవరకూ మనకు పరిచయులైనవాళ్లు 'లోకాభిరామాయణం' మాట్లాడుకోడం మానేశారు. క్లాస్‌లో పిల్లలంతా వచ్చేశారు. ఎక్కడో ఒకళ్లో ఇద్దరో 'యాబ్సెంటీస్' తప్ప. ఫుంఖాను ఫుంఖంగా ఫస్ట్, సెకండ్, థర్డ్ బెల్లులు కూడా అయిపోయాయి. శర్మ

"నా కలం నాకు ఎల్లాఉందో అల్లాతెచ్చిపెట్టు."



మరో బెంచీమీద కూర్చున్నాను. సైన్సు మేష్టారు మైక్రోస్కోపు ఎడంచేత్తోను, అటెండెన్సు రిజిష్టరు కుడిచేత్తోను పట్టుకుని ప్రవేశించారు. రాగానే "శర్మా! నువ్వు నీ మామూలు స్థలంలో కూర్చోలేదేం?" అన్నారు.

శర్మ—"అక్కడ బ్లాక్ బోర్డు కనపడటం లేదండి."

"సరే."

ఈలాగే సోషల్ స్టడీస్ పీరియడు కూడా గడిచింది. తరువాత పీరియడు "P-T" శర్మ తలకాయనొప్పని చెప్పి ఇంటికి వెళ్లిపోయాడు.

* * *

శర్మ తండ్రి సూర్యనారాయణమూర్తి; వకీలు. శర్మతల్లి కమలమ్మ భర్తకుతగిన భార్య. ఉత్తమ ఇల్లాలు.

అప్పటికి సాయంత్రం నాలుగుగంటలయింది.

"నాయనా పంచదారమాట మరిచిపోయావురా. రెండురోజులనుంచీ బెల్లం కాఫీ తాగుతున్నాను. ఊరికే గుండెల్లో మంట. నాకు వెధవ బెల్లం కాఫీ పడదు" అంది శర్మ నాయనమ్మ, సుభద్రమ్మ తన కొడుకుతో.

"తెప్పిస్తానమ్మా నీపంచదార బంగారంగానూ. ఫ్యాక్టరానీ. ఒక్కమారు నాలుగు వీశలు తెప్పించేస్తే నీగొడవ వొదులుతుంది."

"ఔను నాయనా. నిన్ను అష్టకష్టాలపడి పెంచి పెద్దవాణ్ణి చేశాను. ఇప్పుడు నన్నింత మాటంటావా. నా గొడవ ఎప్పుడు వదులుతుందా అనే మీరూ చూస్తున్నారు ఇదిగో సూరీ! ఒక్కమాట. నా గొడవ నాలుగు వీశల పంచదార తెచ్చినంత మాత్రాన ఒదల్దు. కన్నతల్లిని చంపుతానంటావ్. చంపెయ్యి. అయినా పెట్టిశ్రమగాని అడ్డాల్లో ఉన్నప్పుడే బిడ్డలుగానీ గడ్డాలొచ్చాక బిడ్డలా? మహా... మహా..."

సూర్యనారాయణకు కడుపు చెక్కలయ్యేటంత నవ్వు వచ్చింది ఆ ముసలిదాని మాటలకు. తల్లిమాటలు విని నవ్వుకుంటాడు కాని కోపగించి తల్లిని దూషించినవాడు కాడు.

"నాయనా సూర్యం! మన శర్మ బొత్తిగా చిక్కిపోతున్నాడురా, మరీ నాలుగు మెతుకులు భోజనం చేస్తాడు. వాడికో టానిక్కుసీసా ఇప్పిద్దూ."

"అలాగే అమ్మా."

ఇంతలో తలుపు చప్పుడైంది. అంతా తలుపుకేసి చూశారు. శర్మ వచ్చాడు.

"నాయనా! సంజీవరావు కొట్టుమీది కెళ్ళి ఓ నాలుగు వీశల పంచదార పట్టుకొస్తావూ?"

"ఉండవమ్మా" అన్నాడు శర్మ విసుగుగా.

"నేనంటే అందరికీ ఇదే. ఆఖరికి నా కళ్ళముందర పుట్టిన శర్మగాడికికూడా నేను లోకువైపోయాను. గుంటముండని కసిరినట్టు కసిరాడు చూడు, మహా...మహా..."

[39-వ పేజీ చూడండి]



ఆ కాలేజీల్లాంటిది కాదు, ఆ కాలేజీ. అది పురాతనమైంది. హాయిగా ఎవరికీ అందని ఆకాశంలో కూచుంది. అన్ని చోట్ల కాలేజీలున్నా, అందువల్లనే దానికి ప్రత్యేక గౌరవం, పొగడ్తలు. ఆ కాలేజీకి అంత పేరు వచ్చేందుకు కారణం అది మొదటి రోజుల్లో వెలిగించిన దీపమే! ఆ దీపానికి కొడి గట్టినా, వెలుగు తగ్గినా ప్రతిభ తగ్గలేదు. కొండెక్కినా తగ్గదేమో! నిజానికి అందుకు ఇప్పటికీ కారణమేమిటంటే, మిగతా కాలేజీల్లో మోటింగులు చేసి 'భేష్' అనిపించుకున్న లెక్చరర్లు చాలా మంది ఉన్నారు.

ఆ కాలేజీలో కూడా, అన్ని పరీక్షలు జరుగుతాయి. కాని ఒక్క యూనివర్సిటీ పరీక్షలకు తప్ప సవ్యంగా రాసిన వాళ్లను అక్కడ వెతికి తీయలేరేమో? అయినా పరీక్షలు ఆపలేదు. ఎందుకు పెట్టున్నారో దేవుడికే తెలియాలి.

* * *

"ఆ లేదు ఊ లేదు, నీవు రాస్తే బాగుండును"

రెండో విద్యార్థి ఇంకా ఉంటే ఏం జరుగుతుందో అని దూసుకున్నాడు.

* * *

హాస్టలంతా హడావిడిగా ఉంది పరీక్షలు దగ్గర కొచ్చాయని. చదివే వాళ్లు చదువుతున్నారు. కొంత మంది చదివుతూ మిగతా వారు చదవకుండా ఉండేందుకు విశ్వప్రయత్నాలు చేస్తున్నారు. తెగించిన వారు వదిలివేశారు. ఇంత హడావుడికి కారణం పరీక్షల రాయని వారిని 'సస్పెండు' చేస్తామన్న కాలేజీ నోటీసే! పరోపకార విద్యార్థులు ప్రెస్సుల మీద పడ్డారు పేపర్లకోసం కొంత మంది ప్రెస్సు మేనేజర్ల ఒళ్లు హూనం జేశారని కూడా పుకారు పుట్టింది.

ఏదెలాగున్నా పరీక్ష రోజు పొద్దుటి వరకు ఆ రోజు పరీక్ష ఏమిటో తెలియలేదు ఒక్కరికన్నా! అవును, మరి తెలిస్తే చదివి రాయటం ఒక గొప్పా? ఇప్పుడు కొస్తోంటె హాలు కడప మీద కాలెట్టారు అంతవరకు అల్లరి చేస్తున్న విద్యార్థులంతా నిశ్శబ్దంగా కూర్చున్నారు. అంతేగాదు, సూపరవైజరుగారికి స్వాగత చిహ్నంగా ఏనుగ టపాకాయ పేల్చారు కూడాను!

పాపం, అంతజబర్దస్తీతో వస్తున్న సూపర్‌వైజర్ తెలిసో తెలీకో 'బాబోయ్' అన్నాడు. అంతా గొల్లుమన్నారు. అంతే మరి, ఒకడిని ఏడిపిస్తే ఎంతమందో సంతోషించగలరు ఎప్పుడూ.

అచ్చు ఖర్చు కూడా ఎందుకు అని సైక్లో స్టైలు' పేపర్లిచ్చారు! వెనకన ఏముందో అని చూసేసరికి పక్క రోజు పేపరు తిప్పించి సైక్లో చేసి ఉంది. కొంత మంది పేపర్ల కింద మిగతా సబ్జక్టుల కొశ్చన్లు కొన్ని ఉన్నాయి.

ఇలాంటివి జరుగుతున్నాయి కాబట్టే ఆ కాలేజీకి అంత పేరేమో? దూరపుకొండలు నునుపని ఊరికే అన్నారా?

అదే ఆఖరు పరీక్ష. హాలులో విద్యార్థు

## శ్రీ యం. సీతారామయ్య

'ఇంక నెల రోజులేగా పరీక్షలు బాగా చదివావట్రా?' ఒక విద్యార్థి అడుగుతున్నాడు.

'ఆ ఏం చదివేది. మా రూము మేట్సు చదవనిస్తేనా? నీవో'

'నా సంగతి నీకు తెలీదూ. అయినా ఆరునెల్ల పరీక్షల కేం చదవాలిరా. మన పేరు రాయగలిగితే చాలుగా?'

'అదేమిట్రోయ్'

"ఇంతవరకు అంటే ఈ కాలేజీ సంగతి నే నెరిగినప్పటినుంచి విద్యార్థు లెప్పుడూ లెక్చరర్లకు ఎంతో సహాయం చేస్తున్నారు"

"ఏం, ఏమైనా ఇంటి సామానులు తెచ్చి పెట్టారా ఏమిటి?"

"ఛ నీ మొఖం ఈ మాత్రం అర్థం చేసుకోలేనివాడివి, ఏం చదవ గలవురా? ఖాళీ పేపర్లిస్తే ఆయన దిద్దనవసరం లేదుగా"

"ఆ"

అందరి తెలివి బయటపడేందుకు తన తెలివి చూపారు గుమాస్తాగారు.

* * *

మొదటి రోజే పరీక్షల హాలు కలకలలాడుతోంది.

"ఏమోయ్, రుబ్బావు పూర్తిగా"

"ఆ ఇక కాల్చటమే తరవాయి. నీవు పూర్తి చేద్దూ లే ఆ పని"

"నీవెలా చదివావురా? వాడెప్పుడూ కోతలరాయుడేగాని, నీవన్నా నిజం చెప్పు?"

"శక్తి ఉన్నంతవరకు. యాభైకి తక్కువ ఎందులో రావు?"

"ఓ యబ్బ బడాయి"

చదవలేదంటే కోతలు, చదివానంటే బడాయి. మరి ఏం బదులు కోరి ఆ ప్రశ్నలడుగుతారో దేవుడికే తెలియాలి.

శిశు తాగ్గా జిగ జిగలాడే దుస్తులేసుకుని సూపరవైజరుగారు, ప్ర్యాను పేపర్లు పట్టు

లందరు హడావిడిగా ఉన్నారు. పరీక్షల ఆనందం అంతా ఆ నాటితో మరో ఆరు నెల్లవరకు ఆపుకోవాలాయిరి పయిగా సర్వకళలు తెలిసినవారు. ఓ మూల నుంచి హాయిగా ఆనందభైరవి ఆలాపన, మరో వేపున పిల్లి అరుపులు, ఇంకో వేపు గాడిద

(47-వ పేజీ చూడండి)

# కాపురం

'ఏంరా, మధూ. నీవు దసరాకు మీ అత్తారూరుకు వెళ్ళి కోడలును తీసుకు రారా. ఎన్నాళ్ళని వుంచుకుంటావురా. ఇన్నాళ్ళా అవసరం తీరలేదని వూరుకున్నాను. ఆ కాస్తాగూడా అయి నాలుగు నెల్లాయె. అయినా యీడొచ్చిన పిల్లను వాండ్లు మాత్రం ఎన్నాళ్లుంచుకోంటారు. ఇదుగో ఖలాసా రోజాకు వచ్చి తీసుకుపోవలసిందన్నా వ్రాయ వారే మీ అత్తియ్యగారు. పిలుపు లేకపోయినాఇక నీ అవుసరమే కాబట్టినీవన్నా పోయిరారా' అంది మా అమ్మ నేను అప్పుడే భోంచేసి వాకిట్లో మంచంమీద చతికిల బడుతుంటే. వద్దు వద్దంటుంటే ఏమో మంచిపోతున్నట్లు నాకు పద్దెనిమిదో ఏటే మా అమ్మ పెండ్లి కాస్తా చేసేసింది. నా చిన్నతనంలోనే మా నాయన చనిపోవటంచేత, నాకింకో అన్న గానీ, తమ్ముడు గానీ, చెల్లెలు గానీ లేకపోవటంచేతా, మా అక్కయ్య కాపురానికి వెళ్ళినప్పటి నుంచీ యింట్లో యింకో మనిషి - అందులోనూ ఆడపిల్ల తిరుగుతూవుంటే బాగుంటుందని అనిపించేది ఆమెకు. నాకు తల్లిమీద వుండే మమకారంవల్లా ఆమె చెప్పినట్లే చేద్దామనే ఉద్దేశంలో *M. A.* క్లాసులో చేరుతూ పెండ్లి గూడా చేసుకొన్నాను. సంబంధం గూడా మంచిదే. నా భార్య వాండ్ల అమ్మకూ ఒక్క గానీ ఒక్క పిల్ల. వాండ్ల నాన్న గూడా చాలా ఆర్జించి చిన్నతనంలోనే కాలంచేశాడు. చాలా ఆస్థికి వారసురాలు కాకపోవటమే గాక పిల్ల గూడా చాలా తెలివితేటలు గలదని తేల్చేసింది మా అమ్మ. పన్నెండోయేటనే ఒకటి రెండు రోజాలలో ఆ పిల్ల తెలివితేటలు ఎలా గ్రహించిందో. గవర్నమెంటులో ఆఫీసర్లకు వారి క్రిందివారి తెలివితేటలు కనుక్కోటానికని ఆరు నెలలు టైమిస్తారు. కాని మా అమ్మ వాండ్లందరకన్న తెలివిగలదేమో మరి. ఆమెకు నచ్చిన సంబంధం. పైగా నాకు నచ్చకపోవటానికి ఏమీ కారణం లేదు. అమ్మ మాట త్రోసి వేయటం దేనికిలే అని సరే అన్నాను. పెండ్లయిపోయింది. పెండ్లికి మా బంధువులం చాలామందిమి వెళ్ళాము. అటువైపున మగదిక్కు లేదుగదా అని మర్యాదలలో కొంచెం అటూ యిటూ అయినా పట్టించుకోకుండానే అన్నీ సర్దుకొన్నారు మా వాండ్లు. పయిగా ఆస్థి అంతా మనకే దక్కుతుందిగదా అన్న అభిప్రాయం వుంది గనుక కట్నకానుకల దగ్గర గూడా ఏమీ పేచీలు రాలేదు. మా అత్తగారు

> ఇల్లరికపు టల్లుడికి సుఖంలేదు' కాని అత్తారింట కోడలు అత్తతో మాట్లాడదు. ఇలాటి చిక్కులో కాపురం నిలబడాలంటే అమృతహస్తం అవసరమయింది.

గూడా పెండ్లి నాలుగు రోజులూ అందరితో కలిసి మెలిసి తిరుగుతూ 'మా కాముడిదే అదృష్టం చక్కనివాడు, చదువుకున్నవాడు, తెలివిగలవాడు అయినవాడినే కుదుర్చుకుంది' అంటూ నల్గురితోనూ చెప్పింది. నన్ను గూడా నాలుగయిదు సార్లు కలుసుకొని మాట్లాడింది. 'బాగా చదువుకో నాయనా, మాకు యింక నీవే కొడుకువయినా, అల్లుడివయినా. నీవూ కాముడూ నాకు రెండు కండ్లవంటివారు' అంటూ చెప్పింది. నాకూ ఆ మాటలు వింటుంటే సంతోషం వేసింది. పెండ్లికి వచ్చిన బంధువు లెక్కడి వాండ్లక్కడికి వెళ్ళిన తర్వాత నేనూ మా అమ్మా గూడా మా వూరికి వచ్చేశాము. ఎందుకో గాని మా అమ్మమాత్రం అదోరకంగా వుంది. నాకూ ఆమె మనసులో ఏమున్నదీ తెలుసుకోవలెనని అనిపించలేదు. కాలేజీకి శెలవులు లేవు కనుక వెంటనే మా అమ్మకు చెప్పి విశాఖపట్నం చేరాను. మర్నాడే మా అమ్మదగ్గరనుంచీ, మా అత్తియ్యదగ్గరనుంచీ, వుత్తరాలు. మా అమ్మ వుత్తరంలోని ముఖ్యాంశాలు.

చిరంజీవి మధుకు. నీతో చెప్పకుండా వుండకూడదని నిశ్చయించుకొని యీ జాబు వ్రాస్తున్నాను. నీ వింకా రెండేండ్లపాటు చదివితేగాని యం. ఏ. ప్యాసుకావుగదా. యీ రెండేండ్లకూ కనీసం రెండువేలన్నా అవుతవి. పెండ్లిలో మీ అత్తగారు దమ్మిడీ కట్నం గూడా చదివించలేదు. నలుగురిలో

# "తల్లి"

ఎందుకని పూరుకొని తర్వాత ఒక రోజున నేనే మీ అత్తగారితో 'వదినే. ఇక మనం అంతా ఒకటేగదా. నేనూ ఆడదాన్ని. పిల్లవాని చదువు యింక మీరు చూసుకోండి. మా స్థితి మీకు తెలుసును. అద్దెల మీద వచ్చే నూరు రూపాయలతో యిన్నాళ్లూ అబ్బాయిని నేనే చదివిస్తూ వచ్చాను. వాడూ తెలిగానే పరీక్షలిస్తూ వచ్చాడు. యం. ఏ. దాకా నయినా చదివిస్తే వాడే వృద్ధిలోకి వస్తాడని అనుకున్నాను. అందుకే కాస్త కూస్త వున్న చోట సంబంధం చేశాను. మీ రేమీ అనుకోరనుకుంటాను. పైగా మీ కిది ఒక లెక్కలోది కాదని నాకు తెలుసు' అని అన్నాను. మీ అత్తయ్య వెంటనే సరే అని అనేస్తుందనుకున్నాను. కాని ఏమీ మాట్లాడకుండా వెళ్ళిపోయింది. మరలా మనం మన వూరికి వచ్చేనాడు 'వదినే, నే నడిగినదానికి సమాధానం చెప్పలేదు?' అన్నాను.

"అవునమ్మా. నేనూ ఆలోచించాను. నాకూ పొలం పుట్రా అదీ వున్నాయి. చూసేవాండ్లెవరూ లేరు. ఏదో చదువు కున్నన్నాళ్లూ చదువుకొన్నా చదువయి నాక అల్లుడ్ని ఇంట్లో వుంచుకుంటేఅన్ని పనులూ చూసుకపోతాడు. వేరేఉద్యోగం అదీచేసి బాధపడక్కర్లేదు గదాఅని ఆలోచించాను. అంతే గానిమీ వాడికి చదువుకోసరంఅని నేనేమీ యివ్వవలసివస్తుందనుకోలేదు. మీ రు చదువు చెప్పించలేనిచో చదువు మాన్పించి మా ఇంటికి పంపండి పొలం పనులూ అవీ విచారిస్తుంటాడు—మించిపోయిందేమీ లేదు. అయినా యీ రోజుల్లో మనలో ఎంత చదువుకున్నా ఉద్యోగం యిచ్చేవాండ్లెవ్వరూ లేరారు. ఎందుకీ యం. ఏ.లూ, బి. ఏ. లూను," అంటూ మీ అత్తగారు సమాధానం యిచ్చేసింది. ఇది నా కెంతమాత్రం నచ్చలేదు. ఎన్ని అవస్థలు పడయినా నీకు చదువు చెప్పించ నిశ్చయించుకున్నాను. నీ అభిప్రాయం ఏమిటో తెలియజేస్తూ వుత్తరం వ్రాయవలసింది' రెండో వుత్తరం చదువవలెనన్న కుతూహలం కలగలేదు. అయినా ఏముందో చూదామని చదివాను. దానిలో విశేషాలు.

"చిరంజీవి మధుసూదనరావుకు. నీవు చదువుకై తిరిగి విశాఖపట్నం చేరావని తెలిసినది. విజ్ఞానంకోసరం ఎంత చదువు అవుసరమో అంత చదువుకుంటే చాలు. ఉద్యోగంకోసరం చదువ నక్కర్లేదు. ఈ రోజుల్లో మనవాండ్లెంత చదువు చదివినా ఎంత తెలివితేటలుగా ప్యాసయినా ఉద్యోగం దొరకటం లేదు. గౌరవంగా జీవనం చేయటానికి వీలులేదు-చిన్న చిన్న ఉద్యోగాలు చేస్తూ బస్తీలలో అవస్థ పడవలసిన అవస్థ నీకు లేదు. చదువుకున్నన్నాళ్ళూ చదువుకొని ఇల్లు చేరవలసింది పోయిగా నా ఆస్తినే నీ ఆస్తిగా ఎంచి దీనిని సక్రమంగా మేనేజ చేసుకొన్నచో అందరకూ సౌఖ్యంగా వుంటుంది. మా చిన్నని వదలి నేనూ వుండనక్కర్లేదు. బస్తీలలో నీవూ అవస్థపడ నక్కర్లేదు. మగదిక్కు లేక నేనూ యిబ్బందిపడనక్కర్లేదు. ఇంటి మనిషిగా నీవు పొలం అదీ చూస్తున్నచో మనకు వచ్చే అయివేజులోగూడా లోటుండదు. అన్నివిధాలా అందరమూ సుఖంగా వుండవచ్చును. వృధాగా పరీక్షలకోసరమని ఆరోగ్యం పాడుచేసుకోవద్దు. అదీగాక మీ అమ్మగారుగూడా నీ చదువు కోసరం ఇబ్బంది పడుతుందేమో. ఆమెకనవసరంగా ఇబ్బంది కలిగించవద్దు ఆమెకిబ్బంది అని తలచిన మరుక్షణం నీ చదువుకు స్వస్తిచెప్పి, ఇక్కడకు రావలసింది. నీ చదువుకోసరం నేను సహాయపడ నిచ్చగించలేదు. ఎందుకన ఆ చదువు అనవసరం అని నా అభిప్రాయం. దీనికి మరోలా అనుకోవద్దు. నీ ప్రియమయిన కాముడు క్షేమం."

రెండో వుత్తరం చదివిన తర్వాత మనసంతా శూన్యం అయింది ఆ వుత్తరాలను అవతలపారేసి శూన్యాకాశంలోకి చూస్తూ పడుకున్నాను. ఎంతసేపటికీ నిద్రపట్టదు' ఏమిటీ యీ చిత్రం. నామీద అంత ప్రేమ వుంటే మా అత్తగారు నా చదువుకెందుకు పాయపడగూడదూ. చదివి వుద్యోగంచేసి మా అమ్మను సుఖపెట్టుదామని అనుకొన్న కలలన్నీ ఏమిగాను. ఒకవేళ నేనే మా అత్తగారింట్లో వుండిపోతే నాకు సుఖముండునా. ఒకవేళ నేను సుఖపడినా మా అమ్మ గతేమి? ఆమెను వదలి నేను అత్తగారిల్లు చేరటం ఎట్లా? ఆమెకు కోడలు కావాలని నేను పెండ్లిచేసుకున్నాను గాని మా అత్తయ్యకు అల్లుడులేడని గాదుగదా.

మా అత్తయ్య ప్లానువల్ల ఆమెకు సుఖం, మా అమ్మకు కష్టం అని గ్రహించుటకు నాకెంతోసేపు పట్టలేదు. కాని మా అత్తయ్య వ్రాసినదంతా నిజము. ఎంతడబ్బో తగలేసి రాత్రింబవళ్లూ కష్టపడి డిగ్రీలు పుచ్చుకుని ఉద్యోగంకోసం నానా యాతనపడి ఎన్నో అవస్థలతో ఉద్యోగంచేయటం దేనికి డబ్బుకోసరమేగదా. ఆడబ్బు యీ డొంకతిరుగుడుమార్గాలవేవీ లేకుండా సులువుగా లభ్యపడుతుందే మార్గం మా అత్తయ్య చూపిందికదా. ఆమార్గం ఎందుకు అనుసరించగూడదు. దీనివల్ల లాభమేగాని నష్టము కనుబడుటలేదే. అత్తగారింట్లో వుండిపోవటం అధమం అని పెద్దలంటారు. మా అత్తగారందరి మాదిరిగా కనుబడుటలేదే. నా సుఖంకోసం మంచి సలహానే యిచ్చింది. పయిగా నన్ను కాదని ఆమెమాత్రం ఏంచేస్తుంది. ఒక్కగానొక్క కూతురు. నేను సుఖపడితేనే ఆ కూతురుకూ సుఖం. మా యిద్దరి సుఖమే ఆమెకూ సుఖం. అటువంటపుడు నాకేమీ కష్టం వుండగూడదు. ఇంకో వియ్యం. నావల్ల మా అమ్మ సుఖపడవలె ననుకుంటుంది. అట్లాగే నా భార్య వల్ల వాండ్ల అమ్మ సుఖపడవలె ననుకొనుటలో తప్పేమి? మా అమ్మ సుఖం నాకెంతో— వాండ్లమ్మ సుఖం నా భార్యకూ ముఖ్యం. అయినా నేను లేకపోయినా మా 'అమ్మకు కష్టమేమున్నది. నెలకు నూరు

రూపాయలు వస్తవి. నాకు దమ్మిడీ యీయ నక్కర్లేదు. అది పెట్టుకొని ఆమె ఇష్టం వచ్చినట్లు వుండవచ్చును. పుణ్యక్షేత్రములు సేవించవచ్చును. నాదగ్గరకు రావచ్చును. లేక కూతురు దగ్గరకు పోవచ్చును. నాచదువుకోసం యిహ ఆమె కష్టపడనక్కర్లేదు. ఒకవేళ నేనూ నా భార్యా వుద్యోగం చేస్తుంటే కోడలు ఆమెను సరిగా చూడకపోవచ్చును. అప్పుడయినా మా అమ్మకు కష్టమేగదా. పెంచి పెద్దవాడిని చేస్తే నాకు సుఖం లేకపోవటం అలాగుండినా ఇంట్లోనే నాకు స్వతంత్రం లేదని ఆమె అప్పుడనుకోవలసిందే గదా. నేనే మా అత్తగారింట్లో వుండిపోతే ఆమెకా బెంగ అక్కర్లేదు. ఆమె స్వతంత్రానికి భంగం వుండదు. కోడలుగూడా అపుడు ఆమెను ప్రేమతో చూచుటకు వీలుంటుంది. ఇలా ఆలోచిస్తూంటే నిద్రరాలేదు. వెంటనే లేచి లైటువేశాను. గడియారం అప్పుడే 12 కొట్టింది. కలం కాగితం తీసి సమాధానాలు వ్రాశాను.

'పూజ్యురాలయిన అమ్మగారికి, నమస్కారములు. నీవుత్తరం చేరింది. మాఅత్తయ్యగూడా ఒక వుత్తరం వ్రాసింది. నా చదువును గురించి నీవు కష్టపడటం నా కిష్టం లేదు. చదువుకోసరం అని అత్తయ్యను బ్రతిమి లాడటంగూడా వద్దు. నేను ఇక చదువుకు స్వస్తి చెప్పినట్లే. నాలుగయిదు రోజుల్లో అక్కడికి వచ్చి అన్ని సంగతులూ మాట్లాడుతాను. ఇప్పటికింతే' అని ఒక వుత్తరం పూర్తి చేశాను.

'పూజ్యురాలయిన అత్తయ్యగారికి నమస్కారములు. మీ వుత్తరం చూచాను. మా అమ్మగారు మీతో ముచ్చటించిన విషయములూ మీరిచ్చిన సమాధానమూ గూడా తెలుసుకొన్నాను. పరిస్థితులన్నీ పరిశీలించి ఒక నిర్ణయానికి వచ్చాను. త్వరలోనే మీ దగ్గరకువచ్చి మాట్లాడుతాను. సౌభాగ్యవతికి నా శీస్సులు—' అని రెండో వుత్తరం ముగించాను.

మర్నాడే కాలేజీలోని స్నేహితులందరి దగ్గర శెలవు తీసుకొని మూటా ముల్లే కట్టి మా వూరికి బయలుదేరాను. 'వివాహో విద్యానాశాయ' అన్న ముక్క సార్థకం చేశావురా అని మాత్రం అన్నారు నా స్నేహితులు. వారితో నా కింకా ఏమి పని. చదువుకుంటున్నంతకాలమే వారూ నేనూను. తర్వాత ఎవరిదోవ వారిదే. ఆ స్నేహితం వృద్ధి పొంది ఉపయోగపడేది నూటికీ కోటికీ ఒక్కచోటే. అయినా నాకు నా చదువు కొన్నరోజుల నాటి స్నేహితులు బహు తక్కువ. అందువల్ల వారి సలహాలంటూ ఏవీ లేవు. పైగా వారితో నా గృహవిషయములు ప్రస్తావించనూ లేదు. ఎవని కాపురం వానిదే. ఎవరి కష్టములు వారివే. ఒకరి సలహా అంటే నాకు మంట. మనకు తెలియకపోతేగదా ఒకరిని సలహా అడగటం. అందువల్ల యీ విషయములో నాకన్నీ అద్దంలో చూచినట్లు తెలిసిన విషయములే. దీనికి ఒకరి సలహా ఏముందీ. ఎందుకురా కాలేజీ మానటం అంటే 'చదువు చాలించాలోయ్' అని మాత్రం అన్నా. అంతే. మా అమ్మతో అన్ని సంగతులూ చెప్పాను. ఆమెకు మాత్రం నేను చదువు మానటం యిష్టం లేదు. ఏ యిబ్బందీ లేదు. చదువుకోరాయనా అన్నది. కాని నేను నా ఉద్దేశ్యాన్ని మార్చుకొన్నాను. ఆమె గూడా మరి బలవంతపెట్టలేదు. 'అబ్బాయీ. నీవూ పెద్దవాడివయావు నీ ఇష్టం. నీకు చెప్పే రోజులు దాటిపోయినవి.' అని మాత్రం అన్నది. నా కామాటలు కొంచెం కష్టం కలిగించినా నిజము మాట్లాడింది మా అమ్మ.

'అయితే యిప్పటినుంచే నీవు మీ అత్తగారింట్లో ఉండిపోతావా' అని అన్నది. 'లేదమ్మా. ఒకసారి పోయి ఆమెతో మాట్లాడి వస్తాను' అని చెప్పతూ మా అత్తగారూరు బయలుదేరాను. ఉత్తరం వ్రాయకుండానే పిలుపు లేకుండానే వెళ్లాను. పిలుచుట కేమున్నది. నా పనిమీద నేను వెళ్లాను. వాకిట్లో ఎవరో స్నేహితులతో కబుర్లు చెపుతున్నది కాము. నన్ను చూడంగానే ఎక్కడి అమ్మాయిలు అక్కడికి పోయినారు. కాము మాత్రం లోపల దాక్కున్నది. ఇంట్లో వాండ్లమ్మ లేనట్లున్నది. నేనే లోపలికి పోయి 'కామూ' అని పిలచాను. కాని సమాధానం లేదు. అక్కడే ఒక మంచంవుంటే వాల్చుకు కూర్చున్నాను. ఏమి చెపుమా. మాట్లాడలేదు. మూగనోమేమన్నా పట్టిందేమోనంటే నేను రాక ముందు పిల్లలతో మాట్లాడుతూనే వుందే' అనుకుంటుంటే మా అత్తగారు వచ్చింది. 'ఒహో, మధూ! ఎప్పుడు రావడం. ఒక వుత్తరముక్క వ్రాస్తే స్టేషనుకు బండీ పంపేదాన్నే 'అంది.

ఆ. ఎందుకులే. నాకిది క్రొత్తచోటు కాదు గదా. అయినా మీ అమ్మాయి పలకదేం' అన్నా. 'ఆ. ఇది పల్లెటూరుగదూ. పిల్లలకు సిగ్గెక్కువ. ఇప్పట్నించీ మాట్లాడితే ఎగతాళి చేస్తారు. పకే కానిస్నానానికిలే, భోంచేస్తువుగాని' అంటూ లోపలికి వెళ్లిపోయింది.

భోజనాలవీ అయినవి. ఆరాత్రిదాకా మళ్లీ నా భార్య నాకు కనపడితే ఒట్టు. మా అత్తయ్యతో అన్నా. 'ఇలాగయితే ఎలా అత్తయ్యా ఎంతసిగ్గయినా నలుగురువున్నపుడు సిగ్గుపడవచ్చుగాని ఇంట్లో యింకెవ్వరూ లేనపుడుగూడా సిగ్గయితే ఎలా. నేనూ చదువుకొన్నవాడిని. నాకు సిగ్గంటే భయం లేదు. ఇంట్లో మాట్లాడటానికి మరెవ్వరూ లేరయిరి. మీరు మీ అమ్మాయితో చెప్పిచూడండి' అనిమాత్రం అన్నాను. రెండుమూడురోజులు గడిచినవి. వేళకు టిఫిన్లు—భోజనాలూ తప్ప మరేంలేదు. పాలేరు నాతో "బాబయ్యా, పొలాలు చూపెడతా రండి సరదాగా పోదాం' అన్నాడు." 'పోయిచూసిరా నాయనా' అంది అత్తయ్య. ఏదో ఆ పొలం— యీ పొలం అవీ యివీ చూడటం అయిపోయింది. కాని ఇంట్లో నాతో మాట్లాడకపోయినా కనుపించటంగూడా మానేసింది కాము. నేను వాకిట్లో వుంటే

తను ఇంట్లో. నేను ఇంట్లోకి పోతే తను దొడ్లోకి. ఇది నాకేమీ బాగుండలేదు.

'మా అత్తయ్యతో మళ్ళీ అన్నాను. 'అత్తయ్యా, చదువుకు స్వస్తి చెప్పాను. ఇక్కడే వుండి అన్ని విధాలా మీకు సహాయ పడదామనే నిశ్చయించుకున్నాను. కాని మీ అమ్మాయి ఇంత సిగ్గుగావుంటే యీ యింట్లో యింకో గడియ వుండేది లేదు' అన్నాను. 'అబ్బాయీ మధూ. అంత తొందరయితే ఎలా నాయనా, కొత్త పెండ్లికూతురు చనువుగా మగనితో మాట్లాడుతుందా. ఆ అక్కరా తీరాక, నేనొద్దన్నా నువ్వొద్దన్నా వూరుకుంటుందా.' అని అన్నది అత్తయ్య. 'సరే, ఆ అవుసరం ఏదో తీరినాకనే మళ్ళీ వస్తాను' అని చెప్పి మా అక్కయ్యగారూరు వెళ్లాను.

నాకు మా అక్కయ్యఅంటే చిన్నప్పటినుంచీ అదొక వెర్రిప్రేమ. పయిగా మా అమ్మమాటకన్నా ఆమె మాట అంటే భయమూ, భక్తీను. ఆమె కాపురానికెళ్ళి ఐదారేండ్లయింది. ప్రతి శెలవులకూ నేను మా బావగారూరు వెళ్ళేవాడిని. మా బావ ఆ వూరి స్కూలుకు హెడ్మాష్టరు. నన్ను చూడంగానే మా అక్కయ్య సంబరపడేది. నాకేమేమి యిష్టమో అవన్నీ చేసి పెట్టేది. నా పెండ్లయినాక మా అక్కయ్యగారూరు వెళ్ళటం అదే మొదటిసారి. మామూలుగానే మా అక్కయ్య సంతోషంగా నన్నాహ్వానించింది. ఎక్కడినుంచిరా తమ్ముడూ రావటం అని అడిగింది. 'అత్తగారింటినించే' అన్నాను. 'అవున్లే, పెండ్లికాంగానే అత్తగారూరు ముందూ, మావూరు తర్వాతాను' అని అన్నది. నాకూ కొంచెం యిదనిపించింది. 'అయినా నిజమేలే. అసలు రావటం మాని వెయ్యలేదు.' అని మళ్ళీ అనేసింది. 'అక్కయ్యా, ఆమాట లెందుకే, నేను ఎందుకురావటం మానేస్తాను?'

'ఆ. ఎలాగయినా మీ అత్తగారు లక్షాధికార్లు. నీ భార్య లక్షాధికార్లకూతురు. భాగ్యవంతుడవయిపోతివి నీవూను. మేము కనపడుతామా అని అనుమానం.'

'ఎందుకక్కయ్యా, నన్నిట్లా దెప్పి పొడుస్తావు.'

'తమ్ముడూ, నీవు చిన్నవాడివి. నీకింకా అనుభవంలేదు ఇన్నాళ్లూ చదివినది చదువు ఇకముందుదే అనుభవం.'

'ఏమిటక్కయ్యా! నీమాటలు నాకు సరిగా అర్థం కావటం లేదు. చెపితే సరిగా చెప్పు. లేకపోతే—'

'ఆఁ ఏం లేదు. నీ పెండ్లిలోనే చూశాను. మీ అత్తగారికి గర్వం. నీ భార్య సంగతి యింకా తెలీదు. నీవు గనక జాగ్రత్తగా ప్రవర్తించకపోతే కష్టపడుతావు. పయిగా నీ జన్మ వృధా చేసుకుంటావు. నీకు చెప్పవలసినది చాలా వుంది. అయినా 'నీవు తెలివితక్కువ వాడవు గాదు. బి. ఏ. దాకా చదువు కొన్నవాడివి. కనుక కొన్ని సంగతులు చెప్పకుండానే వదిలేస్తున్నాను.'

'అక్కయ్యా, నీ మాటలు నాకేమీ

బోధపడుటలేదే. అసలు సంగతులన్నీ చెప్పవే?'

'ఆ. ఏముందిరా తమ్ముడూ. పెండ్లిలో ఎందుకులే అని నీతో కొన్ని సంగతులు చెప్పలేదు. మీ అత్తయ్యగారికి మన అమ్మంటే లక్ష్యమే లేదు ఇక నా సంగతి ఏదో నీ వొక్కడవే నాకూ, నే నొక్కదానినే నీకూను. అటువంటప్పుడు ఆడబిడ్డ లాంఛనాలయినా జరపమని అమ్మ అడిగితే 'వూరుకోండీ' అని అన్నది మీ అత్తగారు. ఇవతలవాం ళ్లేమనుకుంటారో అన్న చింత ఆమెకు లేనేలేదు. నీవీ పరిస్థితులలో ఆమెతో జాగ్రత్తగా మసలుకోవలె సుమా. నీ ఒక్కడి సుఖమే చూసుకున్నచో అమ్మ విచారపడవలసివుండును. నాకూ ఏదో అండగా వుంటావనుకున్నాను. నీ ధనధాన్యము లేమీ అక్కర్లేకపోయినా అవసరంలో ఆదుకోవలసినవాడవు నీవు. నీ ఒక్కడి సుఖం చూసుకొని మీ అత్తగారింట్లో వుండిపోతే ఇహ మాకు నీ వల్ల ప్రయోజనమే లేదు. అందుకనే నీవు కొంచెం ఆలోచించి మరీ ప్రవర్తించవలసిందిగా చెబుతున్నాను. మనిషయినవాడు స్వయంపోషకుడుగా వుండవలెగాని ఒకరిమీద ఆధారపడరాదు. అది నీకూ మాకూగూడా గౌరవం. అంతేగాని చదువు మానేసి అత్తగారింట్లో విందులారగిస్తూ వారికి సేవచేస్తూ కాలంగడపదలచినటయితే ఇక నే చెప్పవలసిందీ లేదు. నీవు వినవలసిందీ లేదు. ఇప్పుడు నీపయిన ఎంత ప్రేమ తొణికించినా రాను రాను నీకు నీ బ్రతుకుపయినే రోత పుట్టుకొస్తుంది నీవు వాళ్ళ యింట్లో వుండిపోతే. నీకు యిప్పుడు గాకపోయినా, మరి కొన్నాళ్ళకయినా ఆ యిబ్బందులు తెలుస్తవి. నీకు స్వతంత్రం అనేదే వుండదు. పయిగా నీ భార్యకు గూడా నీమీద గౌరవుంటుందా అంటే అదీ అనుమానమే. నీకీ విషయాలన్నీ తెలియక ప్రస్తుతంలో సుఖమే అనిపించినా తర్వాత ప్రమాదం సుమా. నాకు తోచిన విషయాలు చెప్పేను. నీకు కొంచెం కష్టం కలిగినా నిలకడమీద సత్యము నీకే తెలియగలదు. అని ముగించింది మా అక్కయ్య. నాకు తల వంగిపోయింది. నా చదువు నిష్ప్రయోజనం అని ఆనాడు తెలిసింది. ఏమీ చదువని మా అక్కయ్యకు ఇంత లోకజ్ఞానం ఎక్కడిదా అని నా కాశ్చర్యం వేసింది. ఆమెతో జరిగిన సంగతులన్నీ చెప్పాను. చదువుకు స్వస్తి చెప్పిన సంగతీ చెప్పాను. 'ఏమీ ఫర్వాలేదు. తమ్ముడూ. బి. ఏ. దాకా చదువుకొన్నావు. ప్రయత్నంచేస్తే ఏదో వుద్యోగందొరక్కపోదు. నీవు కష్టపడి నీరెక్కల మీద తెచ్చుకొనేది పదిరూపాయలయినా ఆ పదిరూపాయలకు నీ యిష్టంవచ్చినట్లు చేసుకోవచ్చు. కాని మీ అత్తగారి ఆస్థిమీద వేలకువేలు తెచ్చినా నీకా స్వతంత్రంవుంటుందేమో బాగా ఆలోచించుకో' అన్నది. మా అక్కయ్యకు నా కృతజ్ఞతను తెల్పి మర్నాడే మా వూరు చేరాను.

మా అమ్మతో జరిగినదంతా చెప్పాను. అక్కయ్య బుద్ధి చెప్పిందన్నాను. కాని మా అమ్మ యిలాగన్నది. 'అబ్బాయీ. నీ కొకరు చెప్పటం నీవు వినటంగాదు. నీకు తోచినట్లు చేసి నీ సుఖం చూసుకో. నీవు సుఖపడితేనే గదా తర్వాత మా సుఖం. నీవు సుఖపడవలెనని నేనీ పెండ్లి చేశాను గాని నీవుకష్టపడవలెననిగాదు. అక్కయ్యకు నీవు ఒరగబెట్టాల్సిందేమీ లేదు. సామెత కన్నదేగాని యీ రోజులలో అక్కాచెల్లెండ్రను విచారించే వారెవరుకి? ఇహ నాగురించి నీవు బెంగపెట్టుకోవద్దు. కాళ్ళూ చేతులూ సరిగా వున్నంతకాలం నాకొకరుచేయ నక్కర్లేదు. ఏదో చిలకా గోరింకల్లాగా మీ రిద్దరూ కలిసివుంటే నాకదే చాలు. ఇక్కడనయినా సరే. మరెక్కడనయినాసరే.' అని మాత్రం అని వూరుకొంది. నేనుమాత్రం అత్తగారింట్లో వుండే ఆలోచన పూర్తిగా మానివేశాను. ఉద్యోగానికని విశ్వప్రయత్నాలు చేసి చివరకు మావూళ్లోనే ఒకబ్యాంకీలో వంద రూపాయలకు గుమాస్తాగా కుదిరాను. ఉన్నవూళ్లో ఉద్యోగం కనుక, అద్దె కొంపలబాధ లేదు కనుక అంతే కష్టమనిపించలేదు. ఇలా ఉద్యోగంలో ప్రవేశించిన సంగతి మా అక్కయ్యకూ అత్తయ్యకూ కూడా తెలియచేశాను. వార్తిస్తున్నట్లు వ్రాసినవాండ్లెవరూ గాదు. ఇలా ఆరెన్నెల్లయినాక ఒక రోజున మా అత్తవారి వూరినుంచొక బ్రాహ్మణుడు వచ్చాడు. నాభార్య పెద్దమనిషయినట్లు శాంతి చేసుకపోవలసినట్లూ కబురుపెట్టారు. మా అమ్మా నేనూ వెళ్లి ఆ తతంగం అంతా పూర్తిచేసుకొని సంధానానికి ముహూర్తం గూడా పెట్టుకొని వచ్చేశాం.

ఆ ముహూర్తానికి నేనూ మా అమ్మా మా అక్కయ్యమాత్రమే వెళ్లాం. ఆడంబరాలవీ ఏవీ వద్దని ముక్తసరిగా ముహూర్తానికి. ఆ అవసరంకూడా తీర్చుకున్నాను.

ఆ రాత్రివరకూ నా కామె సంగతి దాని మనస్సులోని అభిప్రాయం నాకు తెలీదు. నేను వుద్యోగంలో ప్రవేశించాననీ, ఆ ఉద్యోగంలోనేవుండి జీవితం గడప నిశ్చయించుకున్నాననీ చెప్పాను. ఆమె నవ్వి వూరుకుంది. నీ అభిప్రాయం ఏమిటని అడిగాను.

'నా అభిప్రాయంతో మీ కేమి పని' అని అన్నది.

'ఆ. అలాగాదు. మనం భార్యాభర్తలం గనుక మనం ఒకరి అభిప్రాయాలను ఒకరు తెలుసుకొని వాటి ప్రకారం నడుచుకోవలెనుగదా.'

'సరే, నా అభిప్రాయం ప్రకారం మీరు నడచుకోవలెనా?'

'యీ ప్రశ్న లెందుకు. నే నడిగిన దానికి సమాధానం చెప్పరాదూ.'

అయితే నా కేమీ అభిప్రాయం లేదు. మీ ఇష్టం వచ్చినట్లు చేయండి. మీ యిష్టమే నా యిష్టం.'

'అయితే నీవు నాతో వచ్చుటకు సిద్ధమే నా?'

'అంటే నేను రానని మీకేమన్నా అనుమానమా?

'అబ్బా. నన్ను విసిగించక నే నడిగిన దానికి సూటిగా చెప్పరాదూ?'

'అదేమిటండీ అడగరాని ప్రశ్న లడుగుతూ సూటిగా చెప్పమంటారు మీతో రాకపోతే నే నిక్కడేం చేస్తాను!'

'అదిగాదు కామూ నే ననేదీ, మీ అమ్మ నన్నిక్కడ వుండిపొమ్మంటున్నది. నే నిక్కడుంటే నువ్విక్కడే వుండవచ్చునని ఆమె అభిప్రాయం. నాతో వస్తే నీ కక్కడి సౌకర్యా లుండవు. కష్టపడవలసి వస్తుంది. అందుకని నన్నిక్కడే వుండి పొమ్మనమని నీవు గూడా అంటావేమోనని నా అనుమానం' అన్నాను.

'ఏమండీ మీరు! మీ రిక్కడుంటే మీకేం గౌరవం వుంటుంది. నా కిక్కడుంటే ఏం గౌరవం ఉంటుంది. మీరు మీ రున్నచోటనే వుండాలి. నేను మీ దగ్గరకే రావాలి నా దగ్గరకు రావలెనని మీరు పెండ్లిచేసుకోలేదుగదా. నయం- మా అమ్మమాటలు విని మీరిక్కడే వుండిపోలేదు. ఎప్పటికయినా మనం వేరుగా వుంటేనే మనిద్దరకూ గౌరవం. సుఖానికి కష్టానికి అంతేముందండీ! నాకు అన్నీ ఒకటే. మీతోపాటే నేనూనూ. మీరు రమ్మన్నపుడు రావటానికి సిద్ధమే' అన్నది.

ఆ మాటలు వింటుంటే నాకు పట్టరాని సంతోషం కల్గింది. నిరాశతో గూడిన మనస్సుకు శాంతి గల్గింది. ఇన్నాళ్లూ మాట్లాడని మనిషి ఎన్నో ఏండ్ల పరిచయం గల మనిషిమాదిరి ప్రస్తావించినందుకు ఆశ్చర్యం కల్గింది.

'అయితే కామూ, ఇన్నాళ్లూ యీ మాట లెక్కడికి పోయినవి. నే నేమన్నా మాటాడా యీ రోజున' అంటూ దగ్గర చేరాను. 'ఆ. మీకేమీ తెలీదండీ. సిగ్గంటూ లేకుండా అడవి మగారితో మాట్లాడ కూడదు. రమయిగా కొవరానికి రాక పుడు అసలే మాట్లాడకూడదు. మరీపాటి తెలుసుకోలేకుండా బి. ఏ. ఎట్లాప్యాసయారో' అంటూదగ్గర చేరింది నా కాము.

మూడునిద్రలూ అయిపోయాక నా భార్యను నావెంట పంపమని అడిగాను మా అత్తయ్యను. 'అబ్బాయీ, ఇప్పుడేం తొందర. తర్వాత మంచిరోజు చూసి పంపిస్తాలే. నీవు వెళ్ళిరా అంది. సరేనని వచ్చేశాను. నాలుగు నెలలయినా మా అత్తయ్య నాభార్యను తీసుకరాలేదు. ఇంతలో నాకు రెండు వుత్తరాలు. ఒకటి మా అత్తయ్యదగ్గరనుంచి.

'చి॥ మధుసూదనరావుకు, నీవు వుద్యోగం మానివేసి మాఇంటికి వచ్చేయవలసింది. మా అమ్మాయి అక్కడికి వచ్చి కష్టపడలేదు. నీవు వచ్చేవరకూ మా అమ్మాయిని అక్కడికి పంపేది లేదు—'

రెండవది.

'ప్రియమైన శ్రీవారికి, నమస్కారములు. మీరు వచ్చి నన్ను తీసుకపోవలసింది. మా అమ్మ నన్ను పంపుప్రయత్నములో లేదు. నేనే వద్దామన్న అది బాగుండదు. నా కిక్కడ యింకో గడియ వుండ బుద్ధిపుట్టుటలేదు. మీద విషయములు నేరులో చెప్పెదను. వ్రాయలేను. మీ కాము.'

ఆ వుత్తరాలు చదివి యింటికివెళ్ళి ఏవో నాలుగు మెతుకులు నమిలి వాకిట్లో మంచంమీద నడుంవాల్చాను. మా అమ్మ కింకా సమాచారం చెప్పకముందే ఆమె వచ్చి నన్ను పైవిధంగా ప్రశ్నించే టప్పటికి నాకు మా అమ్మ ఆరోజే ఎలా నాతో యీమాట లన్నదా అనే ఆశ్చర్యం కలిగింది.

'అమ్మా, అత్తయ్యగారు అమ్మాయిని పంపరట. నేనే అక్కడికి పోవలెనట. యీరోజే వుత్తరం వచ్చింది.'

'ఆ, పంపక ఏంజేసుకుంటుందీ!'

'ఏమో. నేనుమాత్రం పోయి తీసుకరాను. ఆమే పంపిస్తుందో, అదే వస్తుందో చూస్తామని అనుకుంటున్నాను.'

'అదేమిటిరా, ఎవరి సొత్తుకోసం వాండ్లే వెళ్ళాలి. రేపు దసరాకి పోయి తీసుకరారా.'

'ఆ. నాకు భార్య అవసరమయితే, భార్యకు నే నవసరంకానా ఏం?'

'సరే. కాని ఆ పిల్ల స్వతంత్రించి ఎలా

(36-వ పేజీ చూడండి)

# బొమ్మరిల్లు



## బక్కవాడు-వస్తాదు

"రవి"

కండలు తిరిగిన వస్తాదు
గరిడీ త్రిప్పుచు నుండంగ
కఱ్ఱకు తగిలిన రాయొకటి
గగన మార్గమున కెగసింది.

చక్కగవచ్చి ఆరాయి
ప్రక్కన కాపురమున్నట్టి
బక్కవానికి తగిలింది
బొక్కెడు రక్తం కారింది.

బక్కప్రాణి కడబట్టింది.
గుక్క త్రిప్పుకొని లేచాడు,
పండ్లు పటపటా కొరుకుచునూ
వస్తాదింటికి వచ్చాడు.

"ఎంతటి వస్తాదైతే నేం
యింతటి పొగరాస్తి" కనుచు
తలుపుతట్టి మరి పిలిచాడు
తంతానంటూ లేచాడు,

దడదడ లాడుచు వస్తాదు
తలుపులు తెరచీ చూచాడు,
బక్క ప్రాణియని గ్రహియించి
చొక్కా చేతులు మడిచాడు.

గడగడ గడగడ బక్కోడు
వడకసాగెను బక్కోడు
చేతులు నలుపుచు బక్కోడు
చిన్నగ యిట్లనె బక్కోడు,

'మీ యింట్లోపలి రాయొకటి
మా యింట్లోపల చచ్చింది
అప్పగింతమని తెచ్చాను"
అంటూ చల్లగ జారాడు.

—

# హకల్ బెరీ ఫిన్

## బొమ్మరిల్లు సీరియల్

## 11

"లోపలికిరా," అని ఆవిడ ఆహ్వానించింది. నేను లోపలికి వెళ్లాను. "ఆకుర్చీమీద కూర్చో"

కూర్చున్నాను. నన్ను నఖశిఖ పర్యంతం ఆమె పరీక్షగా చూసింది.

"నీ పేరేమి టమ్మా?"

"సారా విలియమ్సు," అన్నాను. (సారా అనేది ఆడపేరు)

"ఎక్కడా మీ ఇల్లు? ఇక్కడికి దగ్గిరేనా?"

"కాదండి. హూకర్‌విల్ అని ఇక్కడికి ఏడు మైళ్లుంది. అక్కణ్ణించి వచ్చాను. బాగా అలిసిపోయాను."

"ఆకలిగా కూడా ఉన్నట్టున్నావు. ఆగు, ఏమన్నా పెడతాను."

"లేదండి. ఆకలిగాలేదు. ఇక్కడికి రెండుమైళ్ల దూరంలో ఒకళ్ళయింటి దగ్గిర ఆగాను. వాళ్లు పాపం నాకు భోజనం పెట్టారు. మా అమ్మకి జబ్బుగావుంది. ఇంట్లో ఒక్క సెంట్ డబ్బుకూడా లేదు. అందుకని మా మామయ్యతో చెబుదామని వచ్చాను. మా మామయ్యపేరు అబ్నర్ మూర్. ఈవూరికి అటు చివర వుంటున్నాడట. కాని ఈవూరు నే నెప్పుడూ రాలేదు. మా మామయ్యనికూడా ఎప్పుడూ చూడలేదు. నీకు తెలుసా ఆయన?"

"ఊహూ. తెలియదు. నే నిక్కడికి కొత్తగా వచ్చాను. ఇంకా అందరితోనూ పరిచయం కాలేదు. ఊరి అవతలచివర అంటే చాలా దూరంవుంది. ఈ రాత్రికి ఇక్కడే పడుకో. చీకట్లో ఏం వెడతావ్? రా. నీ గౌను విప్పి ఇంకోటి తొడుగుతాను."

నేను గాబరాపడ్డాను. "వద్దండి. కాసేపు కూర్చుని వెళ్లిపోతాను నాకు చీకటంటే భయంలేదు," అన్నాను.

ఆవిడ నన్ను ఏమైనాసరే ఒంటరిగా పంపించనన్నది. ఇంకా గంట, గంటన్నరలో తన భర్త వస్తాడనీ, ఆయనను తోడిచ్చి "మామయ్య" ఇంటిదాకా పంపిస్తాననీ ఖండితంగా చెప్పింది. తరవాత తన భర్తను గురించి కొంతసేపు ఉపన్యసించింది. నది కెగువన ఉన్న తమ చుట్టాలనుగూర్చి, నది దిగువన ఉన్న చుట్టాలనుగూర్చి, ఇదివరకు తాము ఎంత సుఖంగా, హాయిగా ఉండేవారో, ఉన్నచోట ఉండకుండా ఈ కొత్తఊరికి రావటంలో ఎంత పొరబాటు చేశారో మరి కొంతసేపు ఉపన్యసించింది. ఆమె ఉపన్యాసం ఎంతకీ తెగేట్టులేదు. ఊళ్లో సంగతులు తెలుసుకోవాలనివచ్చిన నాకు ఆశాభంగం కలగటమే కాకుండా విసుగు ఎక్కువకా సాగింది.

చివరికామె ప్రసంగం మానాన్న మీదికీ, నా చావు మీదికి మళ్లింది. నన్నుగూర్చి, టామ్‌సాయర్ గూర్చి, మాకు దొరికిన ఇరవైవేల డాలర్లనుగూర్చి

(పచ్చికోత! ఇరవై వేలుకాదు, పన్నెండు వేలే) మానాన్న స్వభావంగూర్చి, చివరికి నేనెల్లా హత్య చెయ్యబడ్డానో దాన్నిగూర్చి కబుర్లు మొదలెట్టింది. నే నడిగాను:

"ఎవరు చేశారు ఆహత్య? హూకర్ విల్‌లో కూడా మేము దాన్నిగురించి చాలా విన్నాము. కాని హాకల్ బెరీఫిన్‌ని చంపిందెవరో తెలియలేదు"

"ఇక్కడా ఎవరికీ తెలియదు. కొందరు తండ్రే కొడుకుని చంపి వుంటాడని అనుకుంటున్నారు."

"అల్లాగా?"

"మొదట అంతా తండ్రే హంతకుడని అనుమానించారు. తండ్రిని చిత్రవధ చేసేవాళ్లేగాని చివరికింకో సంగతి తెలిసింది. హత్యజరిగిన రాత్రే జిమ్ అనే నీగ్రో తప్పించుకు పారిపోయాడు. వాడే చంపి వుంటాడని అంతా నిశ్చయం చేసుకున్నారు."

"అబ్బే వాడెందుకు—" అనబోయి చప్పన తమాయించు కున్నాను. ఏమీ తెలియనట్టు నోరు మూసుకుని ఉండటం మంచిదను కున్నాను. అదృష్ట వశాత్తు ఆమెకూడా నామాట వినిపించుకోలేదు. ఇలా చెప్పసాగింది:

"హాక్‌ఫిన్ చనిపోయిన రాత్రే జిమ్ పారిపోయాడు. అందుచేత వాణ్ణి పట్టుకున్న వాళ్ళకి మూడువందల డాలర్లు బహుమాన మిస్తామని అధికారులు ప్రకటనచేశారు. మొదట హాక్‌ఫిన్ తండ్రిని పట్టుకున్న వాళ్లకి రెండువందల డాలర్లిస్తా మన్నారు, ఎందుకంటే ఖూనీజరిగిన మర్నాడు తండ్రి ఊళ్లోకివచ్చి తనకొడుకు నెవరో చంపేశారని చెప్పాడు. ఆ మర్నాటి నుంచీ తండ్రి ఎక్కడికో పారిపోయాడు. ఎంత వెదికినా కనిపించలేదు, పట్టుకున్నవాళ్లకి బహుమతి యిస్తామనికూడా అధికారులు ప్రకటించారు. తరవాత జిమ్‌కూడా హాక్ చచ్చిపోయిన రాత్రి నుంచీ కనిపించటం లేదని తెలిసింది. అందుకని ఖూనీ నేరం జిమ్ మీదికి పోయింది. అప్పుడు హాక్ తండ్రి మళ్ళీ ఊడిపడ్డాడు ఊళ్లోకి. జడ్జిథాచర్‌గారి దగ్గిరికిపోయి పీక్కు తినేశాడు: తన కొడుకును చంపిన నీగ్రోను భూప్రపంచంలో ఎక్కడున్నా సరే వెదికి తెస్తాననీ, అందుకు తనకు ఖర్చుకింద కొంతడబ్బు కావాలనీ వేధించ సాగాడు. జడ్జిగారు కొంత డబ్బిచ్చారు, దాంతో హాక్ తండ్రి సాయంత్రాని కల్లా చిత్తుగా తాగేశాడు: అర్ధరాత్రి వరకూ ఎవరో ఇద్దరు కొత్త వాళ్లను వెంట పెట్టుకుని ఊరంతా తిరిగాడు. వాళ్లతో ఎక్కడికో వెళ్లిపోయాడు మళ్ళీ ఐపులేడు. అతనిమీద ఖూనీకేసు పెట్టడం కష్టం. ఎందుకంటే తండ్రికొడుకుని చంపాడంటే ఋజువు చెయ్యటం కష్టం. కాని అతనే చంపి, ఎవరో దొంగలు చంపినట్టుగా గుర్తులు అన్నీ పెట్టివుంటాడని కొందరి నమ్మకం. ఒక ఏడాదిలో ఇదంతా ఎలాగూ చల్లబడుతుంది, అప్పుడు వచ్చి హాక్‌ఫిన్ తాలూకు డబ్బంతా తను అనుభవించ వచ్చునని అతని ఉద్దేశ్యమై వుంటుంది."

"అవును. అంతే అయివుంటుంది. అయితే నీగ్రోమీద ఖూనీ అనుమానం పోయినట్టేనా?"

"ఉహు. కొందరింకా నీగ్రోయే ఖూనీచేసి వుంటాడని అనుమానిస్తున్నారు. ఏమైనా వాణ్ణి పట్టుకుని తేరాలనీ, వాడిమీద ఖూనీనేరం మోపాలనీ కొందరికి పట్టుదలగా వుంది."

"ఎందుకు?"

"ఎందుకేమిటి? పిచ్చిదానివి లాగా వున్నావే? వాణ్ణి పట్టుకుంటే మూడువందల డాలర్లు వస్తాయి. మూడువందల డాలర్లంటే సామాన్య మనుకున్నావా? అంతడబ్బు వస్తోందంటే జిమ్ ఖూనీ చేశాడా లేదా అని తర్జన భర్జనచేసే పిచ్చి వాళ్లుంటారా? జిమ్ అట్టే దూరం పారిపోలేదనీ, ఇక్కడికి దగ్గిర్లోనే ఉండి వుంటాడని కొందరంటున్నారు. నాకూ అలాగే అనిపిస్తోంది. మొన్నెప్పుడో పొరుగింటి వాళ్లతో మాట్లాడుతున్నాను. జాక్సన్ ద్వీపం అని వుందిచూడు. అక్కడెవరన్నా వుంటూ వుంటారా? అని అడిగాను. ఎవ్వరూ ఉండరని వాళ్లన్నారు. నేనేమీ సమాధానమివ్వలేదు. కాని నాకు గట్టిగా అనుమానం వుంది. ద్వీపం మధ్య చెట్లలోంచి ఒకసారి పొగరావటం చూశాను. మనుషు లెవరూ లేనిదే పొగ ఎందుకు వస్తుంది? బహుశా ఆ నీగ్రో బానిస జిమ్ అక్కడ ఉన్నాడేమో? ఒకసారి వెళ్లి ఆద్వీపమంతా గాలించటం మంచిదని తోచింది. ఆరోజు తర్వాత మళ్లీ ఎప్పుడూ పొగ కనిపించలేదు. ఆనీగ్రో అక్కణ్నించి పారిపోయి వుండవచ్చు. అయినా మా ఆయన వెళ్లి

వెదుకుదామనుకుంటున్నారు. ఇంకో మనిషిని వెంట పెట్టుకుని వెడతారట."

ఈ ప్రసంగం వింటుంటే నాకు వంటిమీద తేళ్లు, జెర్రులు పాకుతున్నట్టయింది. చేతులు వణక సాగాయి. చేతుల్తో ఏదన్నా చేస్తూవుంటే గాని అవి ఆగేట్టులేవు. బల్లమీద సూది, దారం వుంటే తీశాను. సూదిలోకి దారం ఎక్కించబోయాను. కాని చేతులు వణుకుతున్నందున సూది, దారం ఒకచోట నిలవటం లేదు.

ఆమె మాట్లాడటం ఆపింది. ఎందుకా అని తలెత్తి చూశాను. ఆమె నావంకే చూస్తోంది నవ్వుతూ. మరింత గాబరాపడి సూది, దారం బల్లమీద పెట్టేసి ఆమె మాటలు శ్రద్ధగా వింటున్నట్లు నటించ సాగాను. నా గాబరా కమ్ముకోడానికిలా అన్నాను:

"అవును మరి మూడువందల డాలర్లంటే మాటలా? ఆడబ్బు మా అమ్మ సంపాదించ గలిగితే ఎంత బావుండును. అయితే మీ మొగాయన ఇవ్వాళ రాత్రే జాక్సన్ ద్వీపానికి వెడుతున్నారా?"

"ఆ. ఇవ్వాళ రాత్రే వెడతారు. స్నేహితుడితో కలిసి ఊళ్లోకి వెళ్లారు. ఒకపడవ అద్దెకి తీసుకుని, ఎవరి దగ్గరన్నా ఇంకో తుపాకి తీసుకుని వస్తారు. అర్ధరాత్రి దాటాక వెడతారు."

"కాని రాత్రిపూట కంటే పగలైతే వెదకటం తేలిక కదూ?"

"నిజమే ననుకో. కాని తెల్లారితే నీగ్రో పారిపోవటంకూడా తేలిక కదూ?"

"అవును అవును"

తరవాత ఆమె నాకేసి వింతగా చూడసాగింది.

ఆమె అలా చూడ్డం నాకు ప్రాణాంతకంగా వుంది. ఇలా అడిగింది:

"నీపేరేమిటన్నావ్ అమ్మాయీ?"

"మెమ్మెమ్మె మ్మేరీ వివ్వివ్వి వ్విలియమ్స్..." కంగారువల్ల నత్తుతూ చెప్పాను. కాని వెంటనే నాకు అనుమానం తట్టింది. ఇందాక అడిగినప్పుడు మేరీ విలియమ్సు కాదు నేను చెప్పింది. ఇంకో పేరేదో చెప్పాను. అది జ్ఞాపకం రావటంలేదు ఎంతకీ.

నా సమాధానం విని ఆమె చిరునవ్వు నవ్వుతూ అంది:

"ఇందాక సారా విలియమ్స్ అని చెప్పావేం?"

"అవునండి. నాపూర్తిపేరు సారామేరీ విలియమ్స్. కొందరు సారా అని, కొందరు మేరీ అని పిలుస్తారు."

"నిజంగా నేనా?"

"అవునండి."

అక్కణ్ణించి ఎలాగైనా బయటపడితే బతికిపోతాననుకున్నాను. కాని అవకాశం చిక్కటంలేదు. తలఎత్తి ఆమెవంక చూసేందుక్కూడా ధైర్యం లేదు.

ఆమె మళ్ళీ సొంత గొడవ ప్రారంభించింది. జీవితం గడవటం ఎంత కష్టంగావుందో, డబ్బులేక ఎన్ని సౌకర్యాలు మానుకోవలసి వచ్చిందో, ఎలికలు ఎలా చంపుకు తింటున్నాయో, చెప్పకొచ్చింది. నిజానికి ఆఇంట్లో. ఎలికలు ఉపద్రవంగానే సంచరిస్తున్నాయి. సొంత ఇల్లులాగా మనుషుల్ని లెక్కచెయ్యకుండా తిరుగుతున్నాయి. ఒకమూల కన్నం వున్నది. ఉండి ఉండి అందులోంచి ఒక ఎలిక మూతిపైకి పెట్టి మాకేసి చూస్తోంది. ఇంటి యజమానురాలు తను సాధారణంగా ఒక ఇనపచువ్వను దగ్గిర పెట్టుకుని ఎలికలమీదికి ప్రయోగిస్తూ వుంటాననీ, కాని రెండు మూడు రోజుల కిందట చెయ్యిబెణికి గట్టిగా విసరలేకపోతున్నాననీ చెప్పింది ఇంతలో ఇంకో ఎలిక తొంగి చూసింది. యజమానురాలు చెయ్యి బెణికిన సంగతి మర్చిపోయి ఆవేశంతో ఇనపచువ్వను విసిరింది. అది గురికి బారెడు దూరంగా పడింది. చెయ్యి కలుక్కుమన్నట్టుంది, "అమ్మో" అని మూలిగింది ఆమె. ఈసారి నన్ను ప్రయోగించమంది. సరే నన్నాను. ఇంతలో మళ్ళీ ఒక ఎలిక తొంగి చూసింది. ఇనపచువ్వను గురిచూసి బలంగా విసిరాను. ఎలిక కన్నంలోకి జారిపోయింది గాని లేకపోతే రెండు ముక్కలుగా చీలిపోయేది. చాల బాగా విసిరావని ఆమె మెచ్చుకుంది. ఈసారి ఎలిక తొంగిచూస్తే, విసరటానికి చువ్వను రెడీగా పెట్టుకోమంది. నేను రెండు కాళ్లు దగ్గిరికి లాక్కుని వాటిమీద చువ్వనుపెట్టి ఉంచాను. అది చూసిందావిడ. నాకళ్లలోకి చూసి చిరునవ్వు నవ్వుతూ అడిగింది:

"ఇదిగో నీ పేరేమిటో నిజంగా చెప్పు."

"చెచ్చె చ్చెప్పాను గదండి. సారామేరీ..."

"ఉశ్శో. అబద్ధమాడకు. నిజంచెప్పు. నీపేరేమిటి? బిల్, టామ్, బాబ్—ఉ. చెప్పు." (ఇవన్నీ మొగపేర్లు)

ఆమె నన్ను అనుమానించిందని తెలుసుకుని భయపడ్డాను.

"అమ్మగారూ! ఏదో బీదముండని. నన్నెందుకేడిపిస్తారు? నాపేరు నిజంగా సారామేరీ..."

"అబ్బబ్బ. ఇంకా అదేనా ధోరణి? నిన్నేమీ చెయ్యను. నీ రహస్యం ఎవరికీ చెప్పను. నామాట నమ్ము. నువ్వేదైనా కష్టాల్లోవుంటే నేనూ, మా ఆయనాకూడా సహాయం చేస్తాము. నువ్వెక్కడో పాలేరుగా వుంటూ, యజమాని బాధ పడలేక పారిపోయివచ్చావు. కదూ? ఇప్పుడుచెప్పు నువ్వెవరివో? ఇక బుకాయించకు ఆడపిల్లనని. నువ్వు మొగపిల్లడివని శుభ్రంగా తెలుస్తోంది."

ఇక లాభం లేదనుకుని నిజంచెబుతానన్నాను. ఎవ్వరితోనూ చెప్పనని ఆమెచేత ఒట్టేయించుకున్నాను. మానాన్న, అమ్మ చచ్చిపోయారనీ, నేను పొట్టగడవక ఒక మోతుబరి రైతువద్ద పాలేరుగా చేరాననీ, అతడు నాచేత వెట్టిచాకిరీ చేయించుకుని బాధ పెట్టేవాడనీ, ఆబాధ పడలేక యజమాని ఉళ్లో లేనప్పుడు ఇంట్లో ఆడపిల్లల బట్టలు దొంగిలించి అవి తొడుక్కుని పారిపోయి వచ్చాననీ చెప్పాను. ఆవూరు ఇక్కడికి ముప్ఫయ్‌మైళ్ల దూరం వుందనీ, పగలు అడవుల్లో దాక్కుని రాత్రిళ్లు మాత్రమే నడుస్తూ ఇవ్వాళ్టికి ఈవూరు చేరాననీ, ఈవూళ్లో మా

మామయ్య అబ్నర్ మూర్ ఉన్నందువల్ల ఆయనేమన్నా సహాయం చేస్తాడేమోనని వచ్చాననీ చెప్పాను.

"ఈవూరు పేరేమిటనుకుంటున్నావు?" అని ఆమె అడిగింది.

"గోషెన్ కదండి."

"ఎవరు చెప్పారు నీకు? ఇది గోషెన్ కాదు. సెంట్ పీటర్స్‌బర్గ్. గోషెన్ ఇక్కడికి పదిమైళ్ళ దూరం వుంది."

"కిందటి రాత్రి ఒకాయన్ని అడిగితే చెప్పాడు: నాలుగురోడ్లు కలిసేచోట కుడివైపు రోడ్డుమీదుగా అయిదుమైళ్లు పోతే గోషెన్‌వూరు వస్తుందన్నాడు."

"వాడెవడో తాగి నిషామీద వున్నట్టున్నాడు అందుకని అలా తప్పు చెప్పాడు. ఇది సెంట్ పీటర్స్ బర్గ్."

"అవునండి. అతడు తాగివున్నట్టే మాట్లాడాడు. అయినా ఇంత తప్పుగా చెబుతాడనుకోలేదు. అరెరె. ఇది గోషెన్ కాదన్నమాట. అయితే నేను పోతానండి. తెల్లారేటప్పటికి మా మామయ్య ఇంటికి చేరగల ననుకుంటా."

"సరే వెళ్లు. కాని నీకు ఏదన్నా మూట కట్టి యిస్తాను తింటానికి. దారిలో ఆకలేస్తుందేమో," అని ఆమె రొట్టె, వెన్న, ఇంకా ఏవో తినుబండారాలు మూటకట్టి యిచ్చింది. నేను అది పుచ్చుకుని లేచాను. ఆమె మళ్లీ అడిగింది:

"ఆవు పడుకుని లేచేటప్పుడు వెనక కాళ్లు ముందు లేస్తాయా? ముందు కాళ్లా? ఆలోచించకుండా టక్కున చెప్పాలి. ఊఁ."

"వెనక కాళ్లండి"

"గుర్రానికి?"

"ముందు కాళ్లండి."

"కొండ వాలుమీద పదిహేను ఆవులు మేస్తుంటే ఎన్నేసి ఆవులు ఒకవైపుకు తిరిగి మేస్తాంటాయి?"

"అన్ని ఆవులూ ఒకవేపుకే తిరిగి వుంటాయి."

"రైట్. ఇప్పటికి నాకు నమ్మకం కలిగింది నువ్వు పాలేరుగా పనిచేశావని. మళ్ళీ నన్ను బోల్తా కొట్టించాలనుకున్నావేమోనని ఈ ప్రశ్నలు వేశాను. అంతకంటే ఏం లేదు. సరేగాని, నీ పేరేమిటి?"

"జార్జి పీటర్స్."

"సరే. జ్ఞాపకముంచుకో మళ్ళీ మర్చిపోతావు. ఈసారి అడిగితే అలెగ్జాండర్ పీటర్స్ అనిచెప్పి ఇందాక జార్జి అన్నావుకదా అంటే నా పూర్తిపేరు జార్జి అలెగ్జాండర్ పీటర్స్ అని కోతలు కొయ్యబోకు. ఏం తెలిసిందా! ఇంకో సంగతి. ఆడపిల్ల వేషం వెయ్యటం నీకు చేతకాదు. గాను అలాకాదు తొడిగేది. నువ్వసలు సూదిలోకి దారం ఎక్కించుతున్నప్పుడే కనిపెట్టాను నువ్వు ఆడపిల్లవి కాదని. ఎందుకంటే ఆడవాళ్లు సూది కదలకుండా పట్టుకుని దారాన్ని దగ్గిరికి తీసుకొచ్చి ఎక్కిస్తారు. మొగవాళ్లు దానికి వ్యతిరేకంగా చేస్తారు. తరవాత ఇంకా నిర్ధారణ చేసుకుందామని నీకు ఇనపచువ్వ యిచ్చాను ఎలికలమీద విసరమని. అందులోకూడా నువ్వు అబ్బాయి వేనని తెలిసింది. ఏ ఆడపిల్లా అంతగురిగా, అంత బలంగా విసర లేదు. అదీకాక ఆడపిల్లలు ఒళ్లో ఏదన్నా వస్తువు పెట్టుకోవలసివస్తే కాళ్లు వెడంచేస్తారు. నీలాగా ముడుచుకోరు. తెలిసిందా నువ్వు మొగపిల్లడివని ఎల్లా కనిపెట్టానో. సరే ఇక వెళ్లు సారామేరీ విలియమ్స్ జార్జి అలెగ్జాండర్ పీటర్స్! నీ కెప్పుడన్నా సహాయం కావల్సివస్తే నాదగ్గిరికిరా. నాపేరు జూడిత్ లోఫస్. నదిఒడ్డున రోడ్డు వెంబడే వెళ్లు. గోషెన్ వూరికి దబ్బున చేరగలవు. పోయిరా నాయనా."

నేను సెలవు తీసుకుని ఇవతలకు వచ్చాను. గోషెన్ దిశగా యాభై అరవై గజాలు నడిచి గిరుక్కున తిరిగి వెనక్కి నాపడవ దాచినచోటికి వచ్చాను. పడవ ఎక్కి జాక్సన్ ద్వీపానికి బయల్దేరాను. నదిలో కొంతదూరం వచ్చేసరికి ఊళ్లో గోపుర గడియారం పదకొండు గంటలు కొట్టడం వినిపించింది. ఇక ఆట్టే వ్యవధి లేదనుకుని గబగబ తెడ్లు వెయ్య సాగాను. ద్వీపం తగలగానే దిగి చెట్లమధ్య ఒకచోట మంటచేశాను. మళ్ళీ పడవఎక్కి మాగుహకు సమీపంలోదిగి పడవను కట్టేశాను. గుహకు పరుగెత్తుకు పోయాను. జిమ్ గాఢంగా నిద్రపోతున్నాడు లేపాను.

"జిమ్, జిమ్! లేవాలి. టైములేదు. వాళ్లు వచ్చేస్తారు ఇంకాస్సేపట్లో. పారిపోవాలి."

(3 -వ పేజీ చూడండి)

# ★ సూర్య గ్రహణం ★

కిందటినెల 25 వ తేదీన సూర్య గ్రహణం వచ్చింది. సూర్య గ్రహణంగాని, చంద్ర గ్రహణం గాని ప్రపంచంలో అన్ని ప్రాంతాలకూ ఒకేవిధంగా ఉండదు. ఒక్కొక్క చోట గ్రహణం సంపూర్ణంగా వుంటుంది. అంటే సూర్యుడుగాని చంద్రుడుగాని కొద్దికాలం పాటు పూర్తిగా కనపడకుండా పోతారు. కొన్ని చోట్ల సూర్య, చంద్ర బింబాల్లో కొంతభాగం మాత్రమే కనబడకుండా వుంటుంది. మరికొన్ని చోట్ల అసలు గ్రహణమే ఉండదు.

ఈసారి సూర్యగ్రహణం చెన్నపట్టణంలోను, అరవ దేశంలోను కనబడలేదు. ఆంధ్ర దేశంలోను, ఉత్తర హిందూస్థానంలోను కొంత వరకూ కనిపించింది. సంపూర్ణ సూర్యగ్రహణం మన దేశంలో కనబడలేదు. ఆఫ్రికాలోని సూడాన్, ఆసియాలోని అరేబియా, ఇరాక్, సోవియట్ దేశం మొదలైనచోట్ల మొత్తం 9000 మైళ్ల పొడుగుగల ప్రాంతంలో సూర్య గ్రహణం పూర్తిగా కనిపించింది.

సంపూర్ణ సూర్య గ్రహణం కనిపించే చోటికి సాధారణంగా ఖగోళశాస్త్రజ్ఞులు దేశదేశాలనుండి వచ్చి మూగుతారు. ఎందుకంటే సంపూర్ణంగా గ్రహణం పట్టినప్పుడు శాస్త్రజ్ఞులకు పనికివచ్చేవి, మనలాటి వారికి అద్భుతంగా ఉండేవి కొన్ని విచిత్రాలు కనిపిస్తాయి.

పగటిపూట నక్షత్రాలు కనిపించవు. ఆకాశంలో నక్షత్రాలు ఉండవని కాదు. భూమికి దగ్గరగా వున్న సూర్యుని కాంతి వల్ల దూరాన వుండే నక్షత్రాలు కనిపించవు. పగటిపూట సూర్య కాంతి లేకుండాపోతే రాత్రి ఎంత బాగా కనిపిస్తాయో అంత బాగాను పగటిపూట కూడా నక్షత్రాలు కనిపిస్తాయి. పగలు సూర్యకాంతి ఉండకుండా ఉండదు, ఒకవేళ మబ్బులుపట్టి చీకటై పోయినా నక్షత్రాలు మబ్బులచాటున దాక్కుంటాయి గాని కనిపించవు. అందుచేత సంపూర్ణంగా సూర్య గ్రహణం పట్టినప్పుడు నక్షత్రాలు కనిపించే అవకాశం వుంది. పగటిపూట ఏయే నక్షత్రాలు, ఏయే గ్రహాలు ఎక్కడెక్కడ వుంటాయో ఆ సమయంలో కనిపెట్టవచ్చు.

ఈసారి సూర్య గ్రహణానికి అమెరికా, బ్రిటన్, ఇండియా మొదలైన దేశాలనుంచి అనేకమంది ఖగోళ శాస్త్రజ్ఞులు సూడాన్, ఇరాక్ దేశాలకు తమతమ శాస్త్ర పరికరాలతో సహా పోయారు. పోయి ఆసమయంలో కనిపించే ఆకాశపు విచిత్రాల నన్నిటినీ ఫోటోలు తీశారు. సూడాన్‌లో మూడు నిమిషాలసేపు సూర్యుడు కాంతిని కోల్పోయి నల్లని గుండ్రని ముద్దలాగ కనిపించాడట. ఆమూడు నిమిషాలు ఆకాశంలో నక్షత్రాలు ప్రకాశించాయట. నల్లని సూర్య బింబంచుట్టూ ఉజ్వలమైన తెల్లని కాంతి వలయం కనిపించిందట. ఈసారి శాస్త్రజ్ఞులు తీసిన ఫోటోల మూలంగాను, ఇతర శాస్త్ర పరిశీలనల మూలంగాను, బుధగ్రహం దగ్గర్లో ఇతర గ్రహాలేమైనా వున్నాయేమోకూడా కనిపెట్ట వచ్చునట.

నక్షత్రాలు హఠాత్తుగా కనిపించగానే సూడాన్ ముఖ్యపట్టణం ఖార్టూంలో మహమ్మదీయ స్త్రీలు "అల్లా తప్ప వేరే దేవుడు లేడు," అని పాటలు పాడుతూ నాట్యం చేశారట. ఇరాక్‌లో అరబ్బీలు గొంతెత్తి ప్రార్థనలు చేశారట. విచిత్ర మేమిటంటే మనదేశంలో

(38-వ పేజీ చూడండి)

# ★ లెక్కల ఆట ★

ఆఫ్రికాఖండంలో ఎథియోపియా అని ఒక దేశం వుంది. ఆ దేశంలోని ఆటవికజాతులవారికి గణిత శాస్త్రం మనకు అభివృద్ధి అయినంతగా అభివృద్ధి కాలేదు. కాని ఏదో విధంగా లెక్కలు కట్టక పోతే వాళ్ల వ్యాపారం, బేరసారాలు ఎలా సాగుతాయి? వాళ్లు అంకెల బదులు గులకరాళ్లు ఉపయోగిస్తారు. ఆ గులకరాళ్లను రెట్టింపు చెయ్యటం, లేక సగం చెయ్యటం తప్ప మరి ఏ విధమైన భాగహారం వాళ్లకి రాదు. ఉదాహరణకి: ఒకడు 29 గొర్రెలను కొందామనుకున్నాడు. ఒక్కొక్క గొర్రె ఖరీదు 19 రూపాయిలు. 29 గొర్రెల ఖరీదు ఎంత? మనమైతే 29 × 19 అని హెచ్చవేసి లెక్క జెబుతాము. ఎథియోపియనులు ఇలా లెక్క కడతారు:

ఒకవైపున 29 దాని కెదురుగా 19 అని వ్రాయి. 29 కింద దానిలో సగం వెయ్యి. ఎంత? 14½. ఎథియోపియన్లకు ½ అనే అంకె తెలియదు కనుక ½ కొట్టివేసి 14 మాత్రమే వుంచు. 14 కింద అందులో సగం 7 వెయ్యి. ఏడుకింద అందులోసగం 3 వెయ్యి. (½ మళ్లీ మినహాయించి) ఇలాగ 1 వచ్చేవరకు సగం చేసుకుంటూపో. తరవాత 19 అనేఅంకె తీసుకో. దాన్ని రెట్టింపుచేసి దాని కిందనే వెయ్యి. ఎంత? 38. ఈ 38 కింద దానికి రెట్టింపు 76 వెయ్యి. 76 కింద దాని రెట్టింపు 152 వెయ్యి. దానికింద 152 కి రెట్టింపు 304 వెయ్యి. ఇప్పుడు లెక్క ఈకింది మాదిరిగా తయారవుతుంది:

| | |
|---|---|
| 29 | 19 |
| 14 | 38 |
| 7 | 76 |
| 3 | 152 |
| 1 | 304 |

ఎడమచేతివైపు అంకెల్లో సరి సంఖ్య లుండటం పాపం. అందుచేత అటువైపు సరి సంఖ్యలుంటే వాటిని, వాటి కెదురుగా ఉన్న సంఖ్యలను కొట్టివెయ్యి. ఎడమచేతి వైపున్న 14 సరి సంఖ్య. దాన్ని, దాని కెదురుగా ఉన్న 38 ని కొట్టివెయ్యి. ఇప్పుడు కుడిచేతి వైపున్న మిగిలిన అంకెలన్నిటినీ కూడు ఎంత వచ్చింది? 551. 29 ని 19 పెట్టి హెచ్చవేసినా అంతే వస్తుంది. తమాషాగా లేదూ లెక్క?

ఇల్లా ఏ రెండు అంకెలనైనా నీ ఇష్టం వచ్చినవాటిని తీసుకుని లెక్క చెయ్యవచ్చు. ఏ అంకెను ఎడమవేపున వేసినా, కుడివేపున వేసినా ఫరవాలేదు. కాని ఎడమ వైపు అంకెను మాత్రమే సగం చెయ్యాలి. కుడివైపు అంకెను రెట్టింపు చెయ్యాలి. జ్ఞాపకం ఉంచుకోవలసిందల్లా ఒక అంకెను సగం చెయ్యటం మొదలెడితే 1 అంకె వచ్చేవరకూ వదిలేసి సగం చేస్తూనే వుండాలి. రెట్టింపు చెయ్యటం మొదలెడితే 1 కి ఎదురుగా అంకె వచ్చేవరకూ రెట్టింపు చేస్తూనే వుండాలి. ★



## హకల్ బెరీ ఫిన్

(29-వ పేజీ తరువాయి)

జిమ్ లేచి సామాన్లన్నీ సర్దసాగాడు. ఎవరు వస్తున్నారు, ఎందుకు వస్తున్నారు అని ఒక్క ప్రశ్న కూడా అడగలేదు నన్ను. ఎవరైతేనేం, ఎందుకైతేనేం మా వెంటపడి తరుముతున్నారనుకున్నాడు. హడావిడిగా సామానంతా పడవలోకి చేరవేశాము. గుహలోని చలిమంట ఆర్పివేసి బూడిదకూడా ఎత్తి పారబోశాము. ఆతరవాత ఒక్క కొవ్వొత్తి కూడా వెలిగించలేదు మేము.

పడవలో కూర్చుని చూశాము, నదిలో ఇంకేమైనా పడవలు సంచరిస్తున్నాయేమోనని. కాని చీకటి గాఢంగా వుండటం మూలాన కన్ను పొడుచుకున్నా కానరావటం లేదు. మాటా మంతీ లేకుండా ప్రయాణం సాగించాము నది దిగువకు.

(ఇంకావుంది)

# [illegible]

## శ్రీ మేడూరి రామకృష్ణ

నుకటికి ఓ రాజు గారుండేవారు. ఆయనకో అందాల అమ్మాయి. పేరు - "సుహాసిని" ఆ అమ్మాయికి గులాబీ పువ్వులంటే చాలాఇష్టం. అంతఃపురంలో మంచి మంచి గులాబీ మొక్కల్ని వేయించి, వాటికి పూసే రకరకాల గులాబీ పువ్వులన్నిటినీ చూసి ఆనందించేది.

ఆ దేశపు మంత్రిగారికో అబ్బాయి. మంత్రి గారబ్బాయన్న మాటేకాని, వొట్టి అల్లరి రకం. చదువుకోమని బడికి పంపితే, ఇంకో దారిన 'గోనేబిళ్ల' ఆటకో, ఎక్కడికో వెళ్ళి కాలం గడిపేవాడు. బడిలో అందరికీ మనవాడంటే హడల్.

ఇలా ఉంటూండగా మనవాడి కంట పడింది రాజు గారమ్మాయ్ ప్రాణ ప్రదంగా పెంచుకుంటోన్న అందాల గులాబీతోట. ఇంకేం? మొదలు పెట్టాడు రోజా దొంగతనంగా తెల్లవారుజామున గోడ దూకి, తోటలోఉన్న రంగు రంగు పువ్వులన్నీ కోసుకు పోతూండేవాడు-రాజు గారమ్మాయికి గులాబీలు పోతోన్నందుకు చాలా దుఃఖమూ కోపమూ కలిగాయి. వెంటనే దొంగ ఎవరో పట్టుకోవలసిందని తండ్రికి మొఱపెట్టుకుంది. వెంటనే రాజుగారు "మన అమ్మాయ్ పెంచుకుంటోన్న తోటలో పువ్వుల్ని ఎవరో దుర్మార్గుడు రోజా దొంగిలిస్తూన్నాడని తెలిసింది. వాణ్ణి రేపు ఉదయం ఆపువ్వులతో సహా హాజరుపెట్టు" అని కొత్వాలుకు హుకుంజారీ చేశారు.

మామూలు వేళకి మనవాడు దర్జాగా గోడదూకి పువ్వులు తనక్కావలసినన్ని కోసుకుని ఎవరూ చూడటం లేదనుకుని నిర్భయంగా తిరిగి వెళ్ళిపోబోతూంటే, అక్కడే దాగిఉన్న భటులు పట్టుకున్నారు. తీరాచూస్తే మంత్రి కొడుకు! ఎవరైనా తప్పదుగా మరి! అందుకని గౌరవంగా ఓ పల్లకీలో మనవాణ్ణి ఆపువ్వుల్తోసహా కూర్చోబెట్టి తీసుకెళుతోన్నారు రాజసన్నిధికి. దారిలో కొంతదూరం వెళ్లాక ఆస్థాన పండితుడు ఎదురై "ఈదొంగ ఎవరయ్యా?" అని కొత్వాలు నడిగాడు. అతను, "మహాప్రభూ! ఏమని మనవి చెయ్యను. మంత్రిగారి కుమారుడే" అని చెప్పాడు-ఓస్! దానికేముంది లేవయ్యా - నోరుంటేనరి! ఊరుగెలవొచ్చు!" అని బిగ్గరగా అని, వెళ్ళిపోయాడు.

మనవాడు లోపల నుంచి ఆ మాటలు వినగానే ఓ ఉపాయం తట్టింది-ఒక్కొక్క గులాబీ పువ్వునీ రేకలు తుంపి నోట్లో వేసుకోటం మొదలెట్టాడు! కాడలన్నీ పల్లకీ తెరలోంచి ఎవరికీ కనపడకుండా ఒకోటీ విసిరేశాడు-భటులు పాపం తిన్నగా పల్లకీని రాజుగారి ముందుకు తీసుకెళ్ళి దించారు.

"మహాప్రభూ మీఆజ్ఞ శిరసా



వహించాం! ఈ పల్లకీలో దొంగని అతడు దొంగిలించిన పువ్వులతో సహా తీసుకొచ్చాం" అన్నాడు కొత్వాలు.

తీరాచూస్తే రాజుగారి కాశ్చర్యం కలిగింది. మంత్రి కుమారుడు! అలాంటివాడ్ని చేస్తాడా? అసలు ఒక గులాబీ పువ్వేనా కేందే! కొత్వాలు తెల్లబోయాడు. మన వాడు పల్లకీలోంచి ఏమీ తెలియని వాడిలా పైకివొచ్చి, రాజుకి వొంగి నమస్కరిస్తూ "మహా ప్రభువులు ఎందుకో ఉదయమే కబురంపారను కుంటాను?" అన్నాడు.

రాజు తన కొత్వాలు పొరపడి అతడిని దొంగగా భావించి తీసు కొచ్చినందుకు ఏమీ అనుకోవద్దని బుజ్జగించి, కొత్వాలును కోప్పడి పంపించి వేశాడు! ★

## సూర్యగ్రహణం

(30-వ పేజీ తరువాయి)

గ్రహణ విషయంలోఉన్న నమ్మకానికి, అరబ్ దేశాల్లోని నమ్మకానికీ కొంత సంబంధం కనిపిస్తోంది. ఏడాదికొకసారి సూర్యుణ్ణి రాహువు మింగుతాడనీ, చంద్రుణ్ణి కేతువు మింగుతాడనీ మనకి ఒక నమ్మకం వున్నది. ఈ రాహువు పాము రూపంలో ఉంటాడు. అలాగే అరబ్బీలు ఒక గొప్ప తిమింగిలం సూర్యుణ్ణి మింగుతూ వుంటుందని నమ్ముతారు. పామును బెదరగొట్టడానికి గ్రహణం సమయంలో అరుస్తూ ప్రార్థనలు చేస్తారు.

గ్రహణాలు ఎలా వస్తాయో మీకు తెలుసు. సూర్యుడిచుట్టూ భూమి, భూమిచుట్టూ చంద్రుడు తిరుగుతూ ఒక సమయానికి ఒకే రేఖలోకి వస్తారు. సూర్యుడు, భూమి, చంద్రుడు వరసగా వుంటారనుకోండి, సూర్యుడికీ చంద్రుడికి మధ్య భూమిఉన్నందున చంద్రుడు కనిపించడు. (చంద్రుడి మీద సూర్యుడి వెలుతురు పడితేనేగాని చంద్రుడు ప్రకాశించడు) అప్పుడు చంద్ర గ్రహణం. అలాగే సూర్యుడు, చంద్రుడు, భూమి వరసగావుంటే సూర్యుడికీ భూమికీ మధ్య చంద్రుడు అడ్డం వున్నందున మనకి సూర్యుడు కనిపించడు.

అప్పుడు సూర్యగ్రహణం. కనిపించడంటే మాయమై పోతాడని కాదు. కాంతి కోల్పోయి నల్లటి నీడలాగ కనిపిస్తాడు.

1900 సంవత్సరం నుంచి ఇప్పటి వరకూ ఈ 52 ఏళ్లలో *28 సూర్యగ్రహణాలు, 147 చంద్రగ్రహణాలు వచ్చాయట.

## బొల్లాయికి ఉత్తరాలు: 6

# సంగీతప్రపంచంలో సాటిలేని బీతోవన్

నువ్వు సంగీతం అంటే చెవి కోసుకుంటావని తెలుసు. అందుకని ఈసారి ఒక గొప్ప గాయకుణ్ణి గురించి రాస్తున్నాను. సంగీతం లలితకళ లన్నిటికీ రాణి అని అంటారు. ఈమాట నిజంగా నిజం. కవిత్వానికి మల్లే సంగీతానికి మాట లక్కర్లేదు; చిత్రలేఖనానికి మల్లే రంగులు కుంచెలు అక్కర్లేదు; శిల్పానికిమల్లే రాళ్లు, ఉలి అక్కర్లేదు; ఈ హంగు లేమీ లేకపోయినా సంగీతంలో ఆత్మలను మేలుకొలిపే శక్తి ఉన్నది. సంగీతానికి శబ్దం ముఖ్యం. గాయకుడు గొంతెత్తగానే, లేక వాద్యం వాయించగానే నిద్రపోయే హృదయాలు మేలుకుంటాయి; చెదిరిపోయిన గుండెలు ఏక మవుతాయి; కరుడు కట్టిన గుండెలు కరిగి ప్రవాహాలై పరవళ్లు తొక్కుతాయి. ఈశక్తి ఇంక ఏకళకీ లేదు.

త్యాగరాజుకృతులు నీకెంతో ఇష్టంకదూ. మన దక్షిణాది సంగీతాన్ని త్యాగరాజు ఎంతో అభివృద్ధిచేశాడు. త్యాగరాజు సంగీతం కంటే వేరే దక్షిణాదిసంగీతం అంటూ ఏమీ లేదనేటంత గొప్పగా మన సంగీతకళని, శాస్త్రాన్ని అభివృద్ధి చేశాడీయన. ఈరోజుకీ మన సంగీతం ఈయన పెట్టిన సరిహద్దుల్ని దాటిపోవడానికి భయపడుతోందంటే అతిశయోక్తి కాదు. మళ్ళీ ఇంకో త్యాగరాజు రావాలి మన సంగీతాన్ని ఇంకా ముందుకు తీసుకుపోవటానికి.

మనకు త్యాగరాజు ఎలాంటివాడో యూరప్ దేశాలవాళ్లకు బీతోవన్ అనే ఆయన అంత



గొప్పవాడు. బీతోవన్ జర్మనీ దేశంలోని బాన్ పట్టణంలో 1770 వసంవత్సరంలో పుట్టాడు. నాలు గేళ్లు నిండకముందే బీతోవన్ మూడు కృతులు స్వయంగా సృష్టించాడట. ఇతని అసాధారణమైన సంగీతప్రతిభ చూసి తండ్రి చిన్నప్పటి నుంచీ వేరే చదువూ గిదువూ చెప్పించకుండా సంగీతమే నేర్పించాడు. మోజార్ట్ అనే ఆస్ట్రియన్ సంగీత విద్వాంసుని వద్దకూడా సంగీత పాఠాలు నేర్చుకున్నాడు. అప్పటివరకూ మోజార్ట్ యూరప్ అంతటికీ ఏకైక సంగీతకారుడుగా ఉండేవాడు. పదిహేడేళ్లు నిండని బీతోవన్ పియానో వాయించటం విని మోజార్ట్ స్నేహితులతో ఇలా అన్నాడు: "జాగ్రత్తగా వినండి; ఈ అబ్బాయి సంగీతంతో ప్రపంచాన్ని జయించే రోజు దగ్గర్లోనే వుంది."

మోజార్ట్ అన్నమాట అక్షరాలా నిజమైంది. బీతోవన్ ప్రతిభను యూరప్ యావత్తూ గుర్తించింది. అతని సంగీతం ఒక్కసారి వింటే జన్మ ధన్యమవుతుందని యూరప్‌లోని రాజులు, ప్రభువులు దగ్గర్నించి సామాన్యులవరకూ అంతా భావించేవారు.

ఇంత గొప్ప ప్రతిభావంతుడైనా బీతోవన్ జీవితమంతా ఎప్పుడూ ఏదో లేనిపోని కారణానికి బాధపడేవాడు. తనకంటే గొప్ప విద్వాంసుడు లేడని అతనికి వల్లమాలిన అహంభావం వుండేది. ఈ అహంభావంతో అతడు తన్నెంతో గౌరవించే మిత్రులను అవమానించేవాడు. వాళ్లు తిరిగి అవమానిస్తే ఆరోజంతా కూర్చుని పశ్చాత్తాపంతో కుమిలిపోయేవాడు. మురికిబట్టలు కట్టుకుని, చిందర వందరగా పిచ్చివాడిలాగ తయారయ్యేవాడు. ప్రభువుల యింట్లో విందుకు అతిథిగా వెళ్లినా యిదే వేషం. అక్కడ పెద్దమనుషుల ముందు కూర్చుని కుర్చీల పక్కన ఉమ్ములు వెయ్యటం, బట్టలు మకిలిచెయ్యటందగ్గిర్నించి నానా అల్లరీ చేసేవాడు. ఎవరన్నా ఏమన్నా అంటే "నే నెవర్నో తెలుసా? బీతోవన్ని," అని

అహంభావం ప్రదర్శించేవాడు. తనఎదుట ఇంకో గాయకుడి పేరెత్తితే సహించలేకపోయేవాడు. విపరీతమైన కోపం, అతిశయం; సంతోషంవచ్చినా, దుఃఖం వచ్చినా అన్నీ విపరీతమే. ఇలాంటిస్వభావం ఉండటంమూలాన జీవితంలో అతడు సుఖపడి ఎరగడు.

బీథోవన్ జీవితంలో అన్నిటి కంటే విషాదకరమైన ఒక విషయం ఏమిటంటే, అతనికి ముప్ఫయి ఏళ్లు దాటినప్పటినుంచీ క్రమంగా చెవుడు వచ్చింది. మధుర మధుర శబ్దాలే ఆధారంగా బతికే గాయకుడికి చెవుడు రావటం కంటే వేరే దుఃఖం ఉందా? ఎల్లా వచ్చిందో పాపం, క్రమంగా వయస్సు ముదిరినకొద్దీ చెవుడు కూడా ముదిరిపోయింది. ఎందరు డాక్టర్లు ప్రయత్నించినా నయం కాలేదు. బీథోవన్‌కి దాదాపు పిచ్చెత్తినట్లయింది. తలుపులు, కిటికీలు అన్నీ బిడాయించి పియానో ముందు కూర్చునేవాడు. కాగితం, కలం తీసుకుని పాట రాసేవాడు. ఆపాటని పియానోమీద వాయించేవాడు. కాని ఒక్క శబ్దంకూడా వినపడేది కాదు. కుమిలి కుమిలి తన సంగీతం తనకే వినబడకుండా పోయినందుకు ఏడ్చేవాడు. రోజుల తరబడి నిద్రాహారాలు మాని అద్భుతమైన సంగీతం, కృతిమీద కృతిగా సృష్టించేవాడు. తరుచుగా అతన్ని గానకచ్చేరీలకు పిలిచేవారు. హాలంతా శ్రోతలతో కిటకిటలాడి పోయేది. ఎదురుగా బీథోవన్ పియానోముందు కూర్చుని వాయించే వాడు. అలౌకికమైన అతని సంగీతానికి శ్రోతలు నాగస్వరం విని నాగుబాము తన్మయమైనట్లు తన్మయులయ్యేవారు. గానం పూర్తయ్యేది. హాలంతా కొన్ని క్షణాలపాటు నిశ్శబ్దసముద్రంలో మునిగిపోయేది. తరవాత చప్పట్లతో హాలు మారుమోగేది. శ్రోతలు ఇంత గొప్ప సంగీతం తమకు అందించినందుకు బీథోవన్‌ను ప్రశంసించేవారు. కాని బీథోవన్‌కు ఇదేమీ వినబడదు. అతని సంగీతమూ వినబడదు, శ్రోతల చప్పట్లు, ప్రశంసలు ఏవీ వినబడవు. అలాగే శూన్యంగా పియానో చూస్తూ కూర్చుని పోయేవాడు. ఎంత గుండె పగిలించే దృశ్యమది!

ఒకసారి బీథోవన్ రాత్రివేళ స్నేహితునితో కలిసి రోడ్డుమీద

[47-వ పేజీ చూడండి]

# కాపురం

(23-వ పేజీ తరువాయి)

వస్తుందిరా. అత్తగారికి నీ వవుసరంలేదు ఆపిల్ల అక్కడుంటేనే ఆమెకు చాలు. కాబట్టి నీవే పోయిరారా నాయనా. ఇందులో పౌరుషంఎందుకు, ఏదో సంబంధం అయింతర్వాత పట్టింపులు పెట్టుకొని కీచులాడుకోటం దేనికి ?'

'సరేనమ్మా. నీవు చెప్పినట్లే రేపే వెళ్ళి దసరానాటికి నీ కోడలును మన ఇంటికే పిలుచుకవస్తాను. ఇంత బెట్టు చేసిన అత్తయ్యగారింట్లో నే సెందుకుంటాను దసరాకి' అని చెప్పి మర్నాడే అత్తారూరు బయలుదేరాను.

## 2

పిలుపులేకుండా అల్లుడు రావటం మా అత్తయ్యకు అలవాటయిపోయింది కాబట్టి నారాక కామె ఏమీ ఆశ్చర్యపడినట్లు లేదు. 'ఏం నాయనా క్షేమమేనా' అని మాత్రం అడిగింది. 'ఆ' అంటూంటే కాము కాళ్లు కడుక్కుకునేందుకు నీళ్లందించింది. ఫలహారాలూ అవీ కాంగానే మా అత్తయ్యతో నేను నా భార్యతోసహా మర్నాడే ప్రయాణం చేయవలసినసంగతి చెప్పాను. 'అదేమిటబ్బాయీ. ఇప్పుడు తీసుకెళ్లటానికేలా వీలుపడుతుంది పండుగ ముందర? పయిగా నేను వ్రాసినట్లుగా మీరిద్దరూ అక్కడికిపోయి కష్టపడటం దేనికి. ఇక్కడే వుండిపొండని ఎన్నిసార్లు చెప్పలే' అంది. 'ఆవిషయాలన్నీ నాకూ తెలుసు. కష్టమో సుఖమో నేను మా ఇంట్లోనే ఉండిపోనిశ్చయించుకున్నాను' అన్నాను.

'ఇది మాత్రం ఎవరియిల్లూ, ఇదీ మీ ఇల్లే ?' అంది మా అత్తగారు.

'అదెట్లాగయినా రేపు మీ అమ్మాయిని తీసుకవెళ్ళవలసిందేనండీ '

'అది వల్లగాదు. అంతగా అవసరం అయితే నీవొక్కడవే పోవచ్చును.'

'మీ ఇష్టం యీ విషయంలో కుదరదు. ఇది నావిషయం. నా ఇష్టం' అని గట్టిగా చెప్పాను. 'ఓహో అదా సంగతి. సరే చూస్తాను. నీ యిష్టం ఎంతమాత్రం సాగుతుందో' అని చుర చుర చూస్తూ లోనికి వెళ్లిండి.

'ఏమే కాముడూ మీ ఆయన చాలా గొప్ప కబుర్లు చెపుతున్నాడు విన్నావా' అని అనింది లోపల వంటప్రయత్నంలోవున్న నా భార్య దగ్గరకు వెళ్లి.

'ఏమిటమ్మా, అంతకోపంగా మాట్లాడుతున్నావు?' 'ఏముందీ, ఆయననిన్ను తీసుకెళ్లుతాడుట వాండ్లవూరికి. నాయిష్టప్రకారం నడవటానికి ఆయనకు వీలులేదట. సరే నీ సంగతేమో కాస్త తేల్చి చెప్పు. నేనూ మీసుఖంకోసం చెపుతున్నాగాని మీరు కష్టపడటానికి గాదు. అక్కడికి వెళ్లిపోతే మీ ఇద్దరకూ గూడా సుఖంలేదు'

'అదేమిటమ్మా - ఆయనగారిష్టప్రకారమే పోదాం. నేనుమటుకూ కాదనటానికేముంది. కష్టమయినా సుఖమయినా వెళ్లక తప్పుతుందా? అయినా మాకక్కడే కష్టమేముంటుందమ్మా'

'ఆ! నీవు పసిదానివి. యీ రోజుల్లో వేలు తెచ్చుకునేవాళ్లే నానాయాతనలు పడుతున్నారు. మీ ఆయనకు వచ్చే వంద రూపాయలతో కాపురం ఎట్లా జరుగుతుందే పిచ్చిదానా, ఇక్కడ వుంటే లక్షణంగా తినవచ్చునుగాని అక్కడది సాధ్యమవుతుందా?'

'పోనీ అమ్మా, నీ కంత యిదయితేచాలనిది నీవు పంపగూడదూ. ఇదీ అదీ పెట్టుకొని ఆయనతో నే వుండి సుఖపడతాను.' అని అనేసింది నాభార్య. 'ఆఁ బాగుంది నీవరస. నీవీ గడపకదిలావంటే ఒక్కకానీ గూడా నేను నీకయి పంపేది లేదు. ఏదో ఇద్దరూ ఇక్కడుంటే సరిపోయింది గాని నీవూ ఆయనపక్షమే అయితే ఇక సాగేది కాదు. ఒక్కక్షణం మీ రిక్కడుండవద్దు వెళ్ళండి. మీకే తెలివి వస్తుంది' అంటూ ఎక్కడికో వెళ్లిపోయింది మా అత్తగారు.

మర్నాడే మేము బయలుదేరాము మా వూరికి. పాపం చీరలు గాని సొమ్ములుగానీ ఏమీ యివ్వలేదు వాండ్లమ్మ. కట్టుకున్న చీరతోనే వచ్చేసింది కాము నా వెంట. ఒక్కగానీ ఒక్క కూతురుమీద ఇంత నిర్దయగా ప్రవర్తించిందేమా ఆమె అనే ఆశ్చర్యంకలిగింది చూచినవారందరికీని. కని, పెంచి పెద్దచేసిన కూతురు తన మాట మీరి —నామాటమీద నడుచుకొన్నందుకే యీ పగంతాను. నాకూ అప్పుడు తెలిసింది. ఒకవేళ నేనే అక్కడ వుండిపోయి ఎప్పుడయినా ఆమె మాట వినకపోతే నా పని ఏమయివుండునా అని.

కోడలుతో నేను బండి దిగుతుంటే మా అమ్మ ఆశ్చర్యపోయింది ఎలా వచ్చారా అని. 'పోనీ పండుగ వెళ్ళింతర్వాత నే తీసుకరాలేకపోయినావురా నాయనా— పాపం వాండ్లమ్మ కెంత కష్టం వేసిందో' అని అన్నది.

'ఆ. పండగ ముందే ప్రయాణం చేసింది మీ వియ్యపురాలు' అంటూ లోపలికి వెళ్లాము మేము.

## 3

ఆరు నెలలయింది. ఎన్నడూ నా భార్య

వాండ్లమ్మ విషయం ప్రస్తావనకు తేలేదు. నేనూ ఆ విషయం రానీయలేదు. ఎంత గారాబంగా పెరిగినా మా యింట్లో అన్ని పనులూ చేస్తూ ఖులాసాగానే వున్నట్లు పడుచుకుంటున్నది. కాని మా అమ్మతో మాత్రం ఎన్నడూ మాట్లాడి ఎరుగదు. మా అమ్మగూడా పాపం తల్లితో విరోధపడి నాతో వచ్చేసినందుకని కోడలును ఎంతో ప్రేమతోనే చూస్తున్నది. అయినా నా భార్య మాత్రం మా అమ్మతో కలిసి మెలసి వుండలేదు దీనికి కారణం నేనూహించలేక పోయినాను. ఒకనాడు నేనే భార్యతో 'కామూ. మా అమ్మ ఎంతో ముచ్చటపడి కోడలు కావలెనని కోరుకొన్నది. ఒక్కనాడయినా నీ వామెతో ఖులాసాగా వున్నట్లు కనబడలేదు. పోనీ ఆమె ఏమన్నా అంటున్నదా అంటే నిన్ను చాలా ప్రేమతో చూస్తున్నది. నీ వామెతో ఎందు కంత కరినంగా ప్రవర్తిస్తావు' అని అడిగాను.

'ఏమండీ. మీ రీ సంగతులలో జోక్యం కలుగజేసుకోకండీ' అనిమాత్రం అనేసింది.

'అదేమిటి కామూ. మనం ఒక చోట వుంటూ నీ వామెతో పలుకకుండా వుంటుంటే ఏం బాగుంటుందీ?'

'ఏం. ఎందుకు బాగుండదు. మీరు మా అమ్మతో మాట్లాడకపోతే నాకేం బాధ లేదే. మీకు మటుకు ఎందుకు బాధ' అని అన్నది.

'బాగుంది నీ వాదన. మగవాడికీ ఆడదానికీ భేదం లేదా? నేను మీ అమ్మతో మాట్లాడవలసిన అవుసరం లేదు. కాని నీవు మా అమ్మకు సేవ చేయవలసిన అవుసరం వుంది. కాని ఆమె నీసేవ కోరటంలేదు. నీతో సన్నిహితమే కోరుతున్నది.'

'ఓహో ఈ మాటలు చదువులేనివాండ్లు చెప్పవలసిన మాటలుగాని చదువుకొన్నవారు చెప్పవలసినవి కావు. మీ రేమన్ననూ యీ విషయంలో నా ఇష్టప్రకారమే వుంటాను. అయినా మీ అమ్మగారిని నేనేమీ అనటంలేదు. ఏదో నా మనసులో బాగుండక ఆమెతో చనువుగా మాట్లాడుటలేదు. మీ కోసరం మా అమ్మనుగాదని వచ్చేశాను. మీతో సరీగ్గానే వుంటున్నాను. అంతేగాని మీ అమ్మతో సరిగా లేనని మీరనటంలో నా కేమీ అర్థం కనపడుటలేదు. అయినా మళ్ళీ చెపుతున్నానండీ. యీ విషయాల్లో మీరు శ్రద్ధ తీసుకోకండీ' అంటూ నా దగ్గర చేరి నా కళ్లలోకి అదోలా చూసింది. నాకూ జాలివేసింది.

'ఇక నెప్పుడూ నిన్నీ విషయంలో కష్టపెట్టను కామూ' అంటూ దగ్గరకు తీసుకొన్నాను.

అప్పటినుంచీ మా ఇద్దరమధ్యా ఎట్టి వాదనా జరుగలేదు. కాపురం హాయిగా గడిచిపోతూంది. మా అత్తగారన్నట్లు మేము కష్టపడుటకు మారుగా సుఖంగా కాలం వెళ్లబుస్తున్నాము. మా అమ్మ గూడా పరిస్థితిని అర్థంచేసుకొని కోడలు పలుకలేదే అన్న చింతను మానివేసి ఖులాసాగానే కాలం వెళ్లబుచ్చుతున్నది. ఇలా వుంటుండగా మా యింటికి మా అక్కయ్య వచ్చింది. ఆమె రావటం నా కెంతో హాయి అనిపించింది కాని కాము మాత్రం ఆరోజునుంచీ అదోరకంగా వుంటం మొదలు పెట్టింది. ఏదో నిరుత్సాహంగా మాట్లాడేది. పైగా మా అక్కయ్యతో గూడా మాట్లాడటంలేదు. అందుకు మా అక్కయ్య నొచ్చుకున్నది. నాతో 'ఏరా తమ్ముడూ. నీ భార్యకు నే నిక్కడకు రావటం ఇష్టంలేనట్లున్నది. అయినా యిది వాండ్ల యిల్లుగాదుగదా. నీ యింటికని వచ్చినా ఆమెగారి కష్ట మెందుకో' అంటూ మాట్లాడింది. నాకూ కష్టంవేసింది. అటు భార్య-ఇటు అక్కయ్య. నాకు మా అక్కయ్యమీద ఎంత ప్రేమో, నా భార్య కేం తెలుసు? అందుకని రాత్రి మళ్ళీ నాకూ నా భార్యకూ వాదన జరిగింది. ఇంటికి వచ్చిన బంధువులతో అందులో మా అక్కయ్యతో మాట్లాడకపోతే చాలా తప్పన్నాను కాని నా భార్య ఆమాటకు వప్పుకోలేదు సరిగదా యింకోమాట గూడా అన్నది. ఏమండీ-నేను మా అమ్మతో తగవులాడి వచ్చినప్పటినుండీ నాకు ఆమెను చూడవలెననే లేదు. కాని మీ అక్కయ్య యిక్కడకు వచ్చినప్పటి నుండీ అదెందుకోగాని నాకూ మా అమ్మను చూడవలెనని వున్నదండీ. కాబట్టి రేపే మనం మా వూరికి వెళ్లవద్దా మన్నది. నా కాశ్చర్యం-కోపం వేశింది. 'మీఅమ్మ ఇటు రావన్నా లేదు. పైగా వుత్తరం ముక్కన్నా వ్రాయలేదు. మనం అక్కడికి పోవచ్చునేం?' అన్నాను. కాని కాము వప్పుకోలేదు. 'అదేమిటండీ. ఆమెతో పోట్లాడినందుకు ఆమెకు కోపం వచ్చి వుంటుంది. అంతేగాని మనం పోతే ఏమండీ! తప్పకుండా మనం రేపు మావూరు వెళ్లాలిసిందే' అంది. నాకు మరీ కోపం వచ్చింది. వెళ్ళటానికి వీలేదని గట్టిగా అనేశాను. 'పోనీ మీరు రాకపోతే నేను వొక్కర్తెనూ వెళ్ళివస్తాలెండి' అన్నది. అట్లా వెళ్ళటానికి నేను వప్పుకోనన్నాను. 'మీరు వప్పుకున్నా వప్పుకోకపోయినా రేపు నేను మా అమ్మగారింటికి వెళ్లటం ఖాయం' అని వూరుకున్నది.

అనుకున్నట్టుగానే తనపెట్టె బేడా సర్దుకొనివాండ్ల వుట్టింటికి బయలుదేరింది. ఇంటో మా అమ్మ, మా అక్కయ్యగూడా వద్దన్నారు కాని వినిపించుకోకుండా నే వెళ్తోస్తానండీ' అనిమాత్రం నాతో అని బండెక్కింది నాకు పట్టరానికోపం వచ్చేసింది. కాని ఏం చేయనూ తోచక పైన గుడ్డ వేసుకొని వీధిలోకి నడిచాను.

## 4

ఇంటికి రాంగానే మా అక్కయ్య నన్ను ప్రశ్నించింది. 'ఏరా తమ్ముడూ, నీవేమైనా అన్నావా నీ భార్యను-పాపం

తల్లి నిగూడా కాదనివస్తే ఎందుకురా దానిని వేధించటం?'

'ఊరుకో అక్కయ్యా, నీకేమీ తెలియదు. పోతేపోనీ, అదే వస్తుంది తిరిగి' అని మాత్రం అన్నాను. మర్నాడే వద్దు వద్దంటుంటే వినిపించుకోకుండా మా అక్కయ్యకూడా వెళ్ళింది. ఇహ యింట్లో మిగిలింది నేనూ మా అమ్మానూ. అలాగా రోజులు వెళ్ళిపోతున్నవి. నెలలు గడచినవి. సంవత్సరం అయింది. కాని నాకూ నా భార్యకూ మధ్య వుత్తరాలు గూడా లేవు. ఆమె తిరిగి రానూ లేదు. ఒకరోజున మా అమ్మ నన్ను మళ్ళీ ప్రశ్నించింది. 'ఏంరా అబ్బాయ్. ఎందుకూ యింత పట్టుదల. తెలిసో తెలియకో ఆ అమ్మాయి వాళ్ళ అమ్మను చూద్దామని వెళ్ళింది. నీవు పోయి తెచ్చుకో గూడదా. ఎవరిమీద కోపం? చదువుకున్న వాడికి కొంచెం ఓర్పు ఉండద్దా. పోయి నీ పెళ్ళాన్ని నీవు తెచ్చుకోనాయనా' అని అన్నది. నాకు మా అమ్మమీద కోపం వచ్చింది. 'తెలుసు. నీవేమీ చెప్పనక్కర్లే'దని అనేసి వూరుకున్నాను.

తర్వాత మా అక్కయ్యదగ్గరనుంచి ఒక వుత్తరం వచ్చింది. నన్ను చూసి పొమ్మనమని వ్రాసింది. వెళ్ళంగానే 'ఏరా తమ్ముడూ, మరదలు వచ్చిందా' అని అడిగింది. 'అదెందుకు వస్తుందీ, రాలే'దన్నాను. 'అయితే నీవే పోయి తీసుకొచ్చుకోగూడదా?' అన్నది.

'నేను పంపితేగదా నేను తీసుకవచ్చుకునేది. అదే పోయింది. అదే వస్తుంది. నేను పోవాలిసిన అవసరం ఏముందీ?'

'బాగుందిరా, నీవు తెలిసినవాడివి. అది తెలియనిదీని. నీవూ దానితో సమానం అయితే ఎట్లాగురా!'

'అక్కయ్యా, నేనుమాత్రం యిక వాళ్ళింటికి పోను. వచ్చినపుడే వస్తుంది' అని అన్నాను. అందరూ నన్నే తప్పు పట్టటం నాకేమీ సరిగా లేదు. అయినా నాకు తోచినట్లే నేను నడువదలచాను. రెండుమూడు రోజు లున్నతర్వాత మా వూరికి వచ్చేశాను.

## 5

ఇంకో నెలరోజులు గడచినవి. ఆరోజు ఆదివారం. ఆఫీసుకు శెలవుగదా అని ఏడుగంటలదాకా పడుకొన్నాను. 'ఏమండీ. ఇంకా తెల్లవారలేదా ఏమిటి జాముప్రొద్దెక్కింది. కాఫీ చల్లారిపోతున్నది. లేచి ముఖం కడుక్కోండి' అంటూ కాము నాగదిలో ప్రత్యక్షమయింది. కలో నిజమో అనుకొంటూ కళ్ళు నులుముకుంటూ యింట్లోకి వెళ్తే మా అత్తయ్య 'ఏం నాయనా, కులాసాగా వున్నావా' అంటూ ప్రశ్నించింది. ప్రక్కనే మా అక్కయ్య 'ఏంరా తమ్ముడూ. యింకా నిద్రమత్తు వదలినట్లు లేదే. ఇంటికి చుట్టాలువచ్చినా నిద్రేనా' అంటూ పల్కరించింది. నాకు అందరినీ చూస్తుంటే పట్టరాని సంతోషం వేసింది. 'అమ్మా, ఎప్పుడు వచ్చారే మన వాళ్ళంతానూ?' అని అడిగాను.

'రాత్రి 2 గంటలబండిలో వచ్చారురా. ఆరాత్రిలో నిన్ను లేపలేదు' అని అన్నది. ఆరోజు మాయింట్లో పండగజేసుకున్నాం. నాకూ చాలా సరదావేసింది. మా అక్కయ్యా, కామూ, మా అమ్మ మా అత్తయ్యా అంతా ఎంతో కలిసి మెలిసి పనులు చేసుకుంటున్నారు నాకిదంతా చూస్తే ఎంతో హాయి అనిపించింది భోజనాలవేళకా చెప్పింది మాకామె జరిగిన సంగతంతా నా బదులు మా అక్కయ్యే మా అత్తారూరు వెళ్లిందట. వెళ్లి నేనెంతో అవస్థపడుతున్నానని చెప్పిందట - నాకెవ్వరిమీదా కోపం లేదనీ, మా అత్తయ్యకు చెప్పిందట. ఇప్పుడెట్లా తిరిగినా చివరకు మా తమ్ముడు అత్తగారింట్లోనే ఉండి ఆస్తిపాస్తులు చూసుకోడా? ఏదో చిన్నతనం. సరదాకో సం ఉద్యోగం చేస్తున్నాడు. నీకూతురు మటుకు వేరే యింట్లో కాపురం చేయవద్దా. వాళ్లిద్దరూ ఎక్కడున్నా మీవారే గదా?' అని చెప్పిందిట. దీంతో మా అత్తయ్యకు నామీద ప్రేమా విశ్వాసమూ కలిగి 'అమ్మాయీ యీరోజే మనమంతా మీవూరుకు పోదాం' అని అనేసిందిట. 'మంచిది' అంటూ మాకామె తన చీరెలూ, సొమ్ములూ యివీ అవీ అన్నీ పోగేసుకొని బయలుదేరిందిట. అది చూసి మా అత్తయ్య 'మా శ్రీ రా. మహాలక్ష్మమ్మగారూ, తన యింటికని మా యిల్లంతా ఖాళీచేసేస్తున్నది. మాకామె చాలా గడుసుదమ్మా' అని నవ్విందిట. అంతా సర్దుకొని ప్రయాణమయి మా వూరు వచ్చేశారుట అదీ జరిగినసంగతి.

ఆ రాత్రి కాము నాతో అన్నది: 'ఏమండీ, మన కాపురం సుఖమయం గావటానికి అవిడే కారణం. నాకు స్వర్గంలో వున్నట్లనిపించింది. కాపురంలో కలతలు లేకుంటే ఎంత సుఖమో తెలిసి వచ్చింది. నవ్వుముఖంతో కళకళలాడే నాకామును దగ్గరకు తీసుకున్నాను. ఇదే కాపురం! ★

# నీటిమీద వ్రాత

(16-వ పేజీ తరువాయి)

శర్మ గదిలోకెళ్లి పడుకుని ఏదో ఆలోచిస్తున్నాడు. సుభద్రమ్మ శర్మని అలా అందిగాని శర్మ ఎందుచేత పడుకున్నాడో కనుక్కోకుండా ఉండలేకపోయింది.

"నాయనా శర్మా! ఏం పడుకున్నావ్? ఒంట్లో బాగాలేదా?"

"..........."

"ఈవాళ పెంద్రాళే వచ్చేశావేం?"

"........ ..."

"తలకాయ నొప్పిగా ఉందా? కొంచెం పంచదార టీ పెట్టివ్వనా? తలకాయ నొప్పి పోతుంది."

"ఏమీ ఒద్దు మామ్మా."

"ఫరవాలేదు కొంచెం తాగుదుగాని" అంటూ వంటింట్లోకి వెళ్ళింది.

శర్మ చెల్లెలు అరుణ లెక్కల పుస్తకం తీసుకొచ్చి "అన్నయ్యా! ఈ లెక్క చెప్పు" అంది.

"పోవే! ఇప్పుడేం లెక్క."

"నీకు రాదని చెప్పు. స్కూలు ఫైనల్ చదువుతున్నావ్. ఫస్ట్ ఫారమ్ లెక్క చెప్పలేవూ?" అని వెళ్లిపోయింది.

సుభద్రమ్మ టీ పెట్టి తీసుకువచ్చింది.



శర్మ త్రాగి మళ్లా పడుకున్నాడు. 'ఇప్పుడు రామం వస్తే ఏమి చేయడమా' అని అతని ఆలోచన. వెంటనే అతనికి మెరుపులా ఒక ఆలోచన తట్టింది. వెంటనే లేచాడు. తను రోజూ లెక్కలు చేసుకుంటూన్న పలక తీసికెళ్లి వీథితలుపు దగ్గరున్న కాళ్లు తుడుచుకునే పీచు తొలగించి అక్కడే పలక పెట్టి వీధి తలుపు చేరేసి వచ్చాడు.

బడి వదలిపెట్టగానే రామం శర్మ ఇంటికి బయలుదేరాడు. శర్మ ప్రొద్దుట జరిగిన సంఘటన గురించి విచారిస్తూంటాడని అతనికి తెలుసు. గబగబా వచ్చి వీధి తలుపు తెరిచాడు. కాళ్లు తుడుచుకునే పీచు అనుకుని పలకమీద అడుగేశాడు. పలక పగుల్తున్నది. ఇది శర్మ చేసినపనే అని గ్రహించాడు. పోయిన పెన్సిలు తను తెచ్చి యిమ్మంటే పోయిన పలక తెచ్చి యిమ్మనేందుకే శర్మ యిలా పన్నాగం పన్నేడని తెలుసుకుని శర్మ తెలివిని కొనియాడేడు. నేరుగా శర్మ గదిలోనికే వెళ్లాడు. శర్మ మంచంమీద పడుకుని ఉన్నాడు. అతడు కూడ శర్మ ప్రక్కన మంచంపై కూర్చొని శర్మ తల నిమిరాడు. శర్మ ఉలిక్కిపడి చూచాడు. అతని నోటివెంట మాట రాలేదు. రామమే ఇలా అన్నాడు "శర్మా! ఎంత పిచ్చివాడవోయ్! ప్రొద్దుట జరిగిన సంఘటనగురించి విచారిస్తున్నావా? రామం సంగతి ఎరుగవా? రామం, నీవు ఒకటే అని నమ్మ. ఈలాంటి వెన్ని జరుగలేదు. అవన్నీ నన్ను తెలుసుకుందామని నువ్వు, నిన్ను తెలుసుకుందామని నేను చేసినవి. అటువంటివాటిల్లో ఇదొకటి. దీనికింతగా విచారించాలా! మనం చిన్నప్పటినుంచీ ఇక్కడే కల్సి చదువుతున్నాము. అలాంటప్పుడు రామం నిన్ను పరాభవిస్తాడనిగాని, నీస్నేహాన్ని పోగొట్టుకుంటాడనిగాని నువ్వు తలపెట్టడం చాల అసంభావ్యం. నేటి మన సంఘర్షణ 'నీటిమీద వ్రాత' అని తెలుసుకో. పధన పాళీ పోతే పోయిందిలే. షికారుకు పోదాం వస్తావా?"

ఇంతలో "ఇంకా లేవేమిరా నాయనా! వీడయింది. అన్నం తినవా" అంటోంది పెద్ద గొంతుక. శర్మ కళ్లు నులుపుకుంటూ లేచాడు. నలువంకలా పరికించాడు. ఎదురుగా వాళ్ల నాయనమ్మ తప్ప మరెవ్వరూ లేరు.

అరె!.. ఇదంతా కల!

వెంటనే పరుగెత్తుకొనివెళ్లి చూచాడు వీధిలో రామం ఉన్నాడేమోనని, అసలు రామం వస్తేగా.

* * *

మర్నాడు క్లాసులో కెళ్లగానే రామం ముఖంకేసి తేరిపార చూశాడు. రామం శర్మదగ్గర కొచ్చి "నిన్నటి సంఘటన నిజమని తలంచకు. పాళీ పాయింటు విరగలేదు. పాయింటు మడిగిపోవడం చూసి నువ్వు పాళీ విరిగిందనుకున్నావు. నిన్నేడిపించడానికి నేను నీదగ్గర పెన్సిలాగేసుకుని దాచేను. ఇది కేవలం నీను నన్ను తెలుసుకోడానికి చేసినపనిగాని మరొకటిగాదు. ఎప్పటికైనా నీవు నిష్కళంక మనస్కుడవే." అని చెయ్యి పట్టుకుని చెప్పాడు. క్లాసంతా రామం తెలివికి సంతసించారు.

రామం, శర్మలు ప్రాణస్నేహితులే. ★



శ్రీమతి రాజ్యం తీస్తున్న చిత్రం 'దాసి' లో రాజ్యం.

# "పెళ్లిచేసిచూడు"

నిర్మాతలు: విజయా ప్రొడక్షన్స్.
దర్శకుడు: ప్రసాద్
కథ: చక్రపాణి
పాటలు: పింగళి నాగేంద్రరావు, ఊటుకూరి సత్యనారాయణ
సంగీతం: ఘంటసాల
తారాగణం:
జి. వరలక్ష్మి, సావిత్రి, యన్. టి. రామారావు, యస్. వి. రంగారావు, జోగారావు, దొరస్వామి, డా॥ శివరామకృష్ణయ్య మొదలైనవారు.

సంఘాన్ని పట్టి పీడిస్తున్న దురాచారాలలో కట్నాల పద్ధతిని దుయ్యబట్టుతూ చక్కని వినోదం కలిగిస్తుంది విజయావారి చిత్రం 'పెళ్లిచేసిచూడు.' పదహారు పాటలతో మూడుగంటలకు పైగా నడిచే ఈచిత్రాన్ని విసుగులేకుండా చూడవచ్చు. పాటలలో పింగళివారి ప్రత్యేకత, పాత్ర చిత్రణలో చక్రపాణిగారి కౌశలం, కథా చిత్రణలో ప్రసాద్ గారి విశిష్టత ఈ చిత్రంలో స్పష్టంగా గోచరిస్తాయి. కథనిగాని చిత్రాన్నిగాని అంతగా పొగిడించడం అనవసరమైనప్పటికీ విసుగుమాత్రం కలగదు.

ఈ చిత్రంలో వినోదానికి మిగతా చిత్రాలలో హాస్యానికీ వ్యత్యాసం ఉంది. మిగతా చిత్రాలలో కథకు సంబంధం లేకుండా ప్రత్యేకం హాస్యంకోసం పాత్రల్ని అనవసర సన్నివేశాల్ని సృష్టిస్తున్నారు. ఈ చిత్రంలో ఆయా వ్యక్తుల మాట తీరునుబట్టి, వాలి గుణగణాలనుబట్టి, సన్నివేశాలనుబట్టి సాధించిన వ్యంగ్య, హాస్యం కథకి ప్రత్యక్షంగా సంబంధించినవే కాని కృత్రిమంగా అతికినవి కావు. అది ఈ చిత్రంలో ప్రత్యేకత. అయితే కథలో తీసుకున్న కట్నాల సమస్య సమాజంలోని అధర్మం, సున్నితమైన హాస్యమూ కూడా ఆయా సన్నివేశాలలో ప్రవేశపెట



విజయావారి "పెళ్లిచేసిచూడు"లో ఎన్. టి. రామారావు, జి. వరలక్ష్మి.

బడిన ఫార్సుల ఎద్దడికి తట్టుకోలేక మరుగున పడిపోవచ్చును.

(అక్కడక్కడ గోవిందయ్యా దంపతుల వికవికలు, చిట్టి పేచీలూ మొదలైనవి బొత్తిగా వెకిలిగా కనపడతాయి)

ఆయా వ్యక్తుల గుణగణాలను అలవాట్లను బట్టి పాత్రల చిత్రణలో తెచ్చిన సున్నితమైన హాస్యమూ వ్యంగ్యమూ, సన్నివేశాలలో ఫార్సుగా మారిపోయాయి. అయితే ఈ ఫార్సువల్ల పాత్రా చిత్రానికి అంతగా భంగం కలగలేదు. కథలో సన్నివేశాలు వాస్తవికతకు దూరమైనప్పటికీ వ్యక్తులను మాత్రం అందరికీ అర్థమయే పద్ధతిలో సానుభూతితో చిత్రించారు. ఒక విధంగా పాత్ర చిత్రణ ఈ చిత్రానికి జీవమని చెప్పాలి.

చిన్న పిల్లల నాటకాలు, స్వప్నదృశ్యంలోని వ్యంగ్యం, అక్కడా అక్కడా చిత్రించబడిన కరుణ జనింపచేసే దృశ్యాలూ, రాజు అమాయకత్వం, అపకారమెరగని వియ్యన్న భేషజాలూ, నవభావాలతో నవజీవనం కోసం అందరి సుఖమూ కనిపెడుతూ చల్లగా కాలం గడిపే రమణ చలాకి స్వభావం మొదలైనవి పేక్షకుల్ని రంజింప చెయ్యగలవు.

కథాంశం: చెల్లెలు అమ్మడు (జి. వరలక్ష్మి) పెళ్లిచేస్తేగాని పెళ్లి చేసుకోకూడదని శపథం పట్టిన శిష్యుడు సిసింద్రీ (మాస్టర్ కుందు)తో సహా దేశంమీద బయలుదేరిన అన్న ఎక్స్ ఎలిమెంటరీ స్కూల్ హెడ్‌మాస్టర్ రాజు (జోగారావు) వెళ్ళి వెళ్ళి, ఆ స్తంతా అతిధి సత్కారంకోసం తగ

అంజలీవారి 'పరదేశి'లో తార (వసంత), ఆనంద్ (గణేశన్)





పీపుల్సవారి 'పల్లెటూరు'లో

పెద్దరైతు సాంబయ్య (కోడూరు అచ్చయ్య)ను మరొక రైతు (డిస్ట్రిబ్యూటర్ వెంకయ్య) "అమ్మాయి" పెళ్లిగురించి అడుగుతున్నాడు.



భరణీవారి 'ప్రేమ' లో పరశురామ్ (ముక్కామల) మోతీని (రేలంగి) బెదిరిస్తున్నాడు.

లేసిన ఎక్స్ జిల్లా బోర్డ్ మెంబర్, పంచాయతీ బోర్డ్ ప్రెసిడెంట్ ధూపాటి వియ్యన్న (రంగారావు) బలవంతపు సత్తారంలో చిక్కుకుంటారు. దొరికిన పిట్టని వొదిలి పెట్టకుండా కూతురు సావిత్రిని (సావిత్రి) రాజుకిచ్చి పెళ్ళిచేస్తాడు వియ్యన్న, తరవాత గడ్డిపాడులో వెంకటపతిగారి (డా॥ శివరామకృష్ణయ్య) కొడుకు రమణ (రామారావు), సంబంధాన్ని పదిహేను వేల కట్నంతో అమ్మడికి నిశ్చయించి వియ్యన్న తాంబూలాలు పుచ్చుకుంటాడు. కాని పది తాకట్లు పెట్టిన భవంతి తప్ప పైనచిల్లిగవ్వ ఆస్తి మిగలని వియ్యన్న గుట్టు కాస్తా పెళ్ళిలో బయటపెట్టి మేనరికం తోసి పుచ్చిన రాజు మీద మేనమామ గోవిందయ్య (గౌరస్వామి) మీద పగ తీర్చుకుంటాడు. తాళి గట్టిన తరవాత కూడా కోడల్ని వొదిలేసి కొడుకుని తీసుకుపోయి రెండో పెళ్ళి చెయ్యడానికి సిద్ధపడతాడు వెంకటపతి. కాని తండ్రిని మభ్యపుచ్చి రమణ అత్తవారింటికి కెళ్ళి అమ్మణ్ణి తీసుకుని పట్నం వెడతాడు. గోవిందయ్య కూతురు చిట్టిని రమణకిచ్చి పెళ్ళి చెయ్యడానికి ప్రయత్నిస్తాడు. ఇది గ్రహించి చిట్టి వియ్యన్న



యువావారి 'టింగ్ రంగా'లో
యస్. వరలక్ష్మి, కోటీశ్వరరావు, తిలకం, సరళ.

సమత్సంలో బావభీమన్న రెండుని తెలుగు మంత్రాలతో పెళ్లి చేసుకుంటుంది. అయినా గోవిందయ్య కూతుర్ని బలవంతాన రమణకిచ్చి పెళ్ళి చెయ్యాలనుకుంటాడు. రెండోపెళ్ళి తప్పించుకోడానికి రమణ పిచ్చెక్కినట్లు నటిస్తాడు, రాజు డాక్టరు వేషం అమ్మడు నర్సు వేషం వేసుకుని కొంతకాలం వెంకటపతిని మోసగించినా చివరికి గోవిందయ్య గుట్టు బయటపెడతాడు. చివరికి రెండోపెళ్ళికి నిరాకరించి ఆ స్తివోదులుకో డానికి రమణ సిద్ధపడతాడు. చిట్టికీ భీమన్నకీ పెళ్ళయిందని తెలుసుకుని వెంకటపతి మన మణ్ని తనకిచ్చే షరతుమీద అమ్మణ్ణి రమణ ఏలుకోడాని కొప్పుకుంటాడు.

అప్పుడప్పుడు తటస్థపడే చిత్రమైన వ్యక్తులుగా కనపడతారు వియ్యన్న, రాజు, గోవిందయ్య వంటివాళ్లు. రంగారావు, జోగారావు, దొరస్వామి, డా॥ శివరామకృష్ణయ్య మొదలైనవారు చిత్రమైన వ్యక్తిత్వాలను నేర్పుతో నిరూపించారు. ★

శుభోదయావారి 'ఆదర్శం'లో రేవతి, జగ్గయ్య.







ఆర్. పద్మనాభన్ వారి 'రాజేశ్వరి' లో ఒకదృశ్యం.



ఏ. యన్. ప్రొడక్షన్స్‌వారి 'ఆడబ్రతుకు'లో కృష్ణకుమారి.

# ముందుచూపు

(5-వ పేజీ తరువాయి)

వాళ్ల బెడద నీకేం లేదుకదా. వాడికయినా పట్టుమని పదిహేడేళ్లు లేవు నీకయినా పదిమందికి ఒక్కబిగిని చదువు చెప్పించేటంత స్థితివుంది.. అల్లాంటప్పుడు వీడొక్కడికీ చదువు చెప్పించేందుకు నీవెందుకింత జెనకాడుతున్నావో తెలియక ఆశ్చర్యం కల్గుతోంది."

"అబ్బాయీ!—నువ్వు లక్ష చెప్పు... వీడిదొ దరిద్ర జాతకం.. వీడి భవిష్యత్తు మీద గంపెడాశ పెట్టుకుని ఏది చేసినా గాని ఎదురు తిరిగి వూరుకుంటుంది."

"సుందరం జాతకమంతా సాకల్యంగా పరీక్షించిన జ్యోతిషుడిలా మాట్లాడుతున్నావు"

"జ్యోతిషులు!—వాళ్లు చెప్పిన ఫలితాలే నిజమయ్యుంటే వీడి దశ మరోలాగుండి వుండేది!—వాడు వట్టి మలప సన్యాసి కాకుండా వుంటే వాడికి అందేది అంటకుండాను, ముట్టేది ముట్టకుండాను ఎందుకుంటుంది?"

"అల్లాగని వీడిజాతకంలో రాసివుందేమిటి"?

"అల్లాగని రాసివుందని జ్యోతిషులు చెప్పకపోయినా మరోలా మాత్రం వుండదని గట్టిగా తీర్మానించుకున్నాను"- నా నిర్ణయం తప్పవుతే ఈ పాటికి ఎనభై వేల రూపాయిలూ తన్నుకుంటూ వచ్చి వీడి కాళ్లదగ్గర పడివుండేవి."

"అంటే నీ వుద్దేశం?"

"మరేం లేదు.. కొంత కాలం క్రితం జ్యోతిషులు చెప్పారు."

"వీడికో పాతు దొరకుతుందనా"?

"వాళ్లల్లా ఎన్నడూ చెప్పలేదు.. కాని వాళ్లు నాకు చెప్పిన ఫలితం మీద ఆధారపడి సుందరాన్ని బంగారు పిచికను చెయ్యాలని ఆలోచించి వలపన్నాను. వీడు నష్టజాతకుడవడంవల్ల అవల ఎదురు తిరిగి నేను అందులో చిక్కుపడ్డాను."

"నువ్వేదో భ్రమలో పడి ఎవరిదో మాట పట్టుకుని, ఆ భ్రమ నివారణ వక బాధపడుతూంటే అదంతా సుందరం చేసినట్టు వీడి చదువు పాడు చేయడమేమిటి?"

"ఎనభైవేలూ ఒక్కసారి సూత్రంగా వచ్చేమార్గం ఎదురుగుండా కనిపిస్తూంటే, అది వాడికి సంక్రమింపజేయాలనుకోవడం తెలివితక్కువనే నా అభిప్రాయం?!"

"సుందరం సుఖంగా జీవించేందుకు నువ్వు ప్రయత్నించడం పొరపాటని కాదు...కాని నువ్వు తలా తోకా లేకుండా మాట్లాడుతున్నావు సుందరం చేసిన నేరమేదో నా కర్థం కావడంలేదు. చెప్పేదేమో సరిగా చెప్పు."

"వళ్లు మండిపోతూంటే ఏమిటి తిన్నగా చెప్పేది?

వాడి భావోన్నత్యం మనసులో పెట్టుకుని చేసిన పనల్లా బెడిసికొడుతోంది. రెండేళ్ల క్రితం పెద్దజ్యోతిషుడొకాయన వస్తే నా జాతకచక్రం చూపించాను."

"నీ కొడుకు మహారాజవుతాడని చెప్పాడనుకుంటాను!"

"వేళాకోళం కట్టిపెట్టు.. నాకు మారకం వుందని చెప్పాడు వెంటనే—

"అఘోరించలేకపోయాడు!—ఆ మాట విని సుందరం పుట్టిన నక్షత్రదోషంవల్ల నీకు కీడుకల్గుతున్నదనే బెంగతో సుందరాన్ని పాడుచేస్తున్నావన్న మాట!!"

"చచ్చిపోతానని భయపడుతున్నావని అనుకోకు ఆ గడువు దాటిపోయి అప్పుడే తొమ్మిది నెలలయింది. అందుకనే విచారమంతా."

"ఏమిటీ వెర్రిధోరణి?! – ఏమంత కష్టాల్లో వున్నావని మారకం తప్పిపోయినందుకు విచారిస్తున్నావు?—ఎవరైనా వింటే నవ్విపోతారు."

"విచారించక ఏం చేయాలి?—ఎంత అవస్తపడవలసి వస్తోందో నీకేం తెలుసు? సుందరమో జపగనకే వాడికి ఎనభైవేలూ కనుమాపు మేరలో లేకుండా పోయాయి; సర్దుబాటు చేసుకోలేక నేను నానా యాతనలూ పడవలసివస్తూంది."

"వెర్రి కుదిరింది తలకు రోకలి చుట్టండన్నట్టుంది నీవరస! నువ్వు చనిపోతే వాడికి ధనం రావడమేమిటి? – నాకు మతి భ్రమిస్తూన్నట్టుంది!"

"నీకల్లాగే కనిపిస్తుంది. చెప్పేది సరిగా విని మాట్లాడు" జ్యోతిషుడు ఫలానా తారీఖునాటికి మారకం వుందని చెప్పగానే – అతడు చెప్పిన గడువుకుముందుగానే అల్లాంటిది జరిగినా జరగవచ్చు లేదా కొంచెం ఎడంగా నన్నా తటస్థింపవచ్చు – ఎల్లా జరిగినా నష్టం వుండదని ఆలోచించి మూడు నెలల వాయిదామీద పదిహేనేళ్లకు ఎనభైవేలకు జీవితం భీమా చేశాను. ఆగడువుదాటిపోయి తొమ్మిదినెలలయింది సరిగదా, ముందు పదిహేనేళ్లూ కూడ గూబలు వలుపుకుంటూ యిన్స్యూరెన్సు కంపెనీవాళ్లకు సొమ్ము చెలిస్తూ వుండక తప్పనట్టు కనిపిస్తూంది. ప్రతివాయిదాకూ ప్రీమియం కట్టేటందుకు ఎంత బాధ పడవలసివస్తుందో నువ్వు గుర్తించలేకపోతున్నావు. సుందరాని కాకస్మికధనలాభమేవుంటే నాకీ క్రమే లేకపోను. అంచేత వాడెల్లాగూ సామాన్య జీవితం గడపవలసిన వాడేనని నిర్ధారణ చేసుకోక తప్పదు. అల్లాంటప్పుడు వాడిని గురించి అవసరంగా డబ్బెందుకు ఖర్చుపెట్టాలి?"

"బ్రతికుండగా కొడుకుని అభివృద్ధిలోకి తీసుకువచ్చేందుకు జెనకాడుతూ, చచ్చిపోయి అదృష్టవంతుణ్ణి చేద్దామనుకుంటున్నావన్నమాట! దివ్యంగావుంది ఆలోచన!! – నువ్వెల్లాగూ ప్రీమియములు కట్టక విడిచేరకం కాదని నాకు తెలుసు. పదిహేనేళ్ళ తర్వాతనైనా వాడికా సొమ్ము రాకమానదు. కాబట్టిముందు కార్యక్రమాని కుపక్రమించి, వాడిని కాలేజీలో జేర్పు, వాడిబ్రతుకు వాడు బ్రతుకుతాడు.

"వాడి బ్రతుకువరస కనిపిస్తూనే వుంది; వస్తుందనుకున్న అత్తవారి ఆస్తికూడా వీడి కందకుండా పోయింది. యిల్లాంటి దరిద్ర దామోదరుడి నిమిత్తం ఎర్రటి ఏగాణీకూడ చెయ్యి జార్చగలచుకోలేదు. నా నిశ్చయానికి తిరుగులేదు"

"నువ్వు పట్టుకున్న కుందేలుకు వాలో కాలు వుండడమనేది లేదన్నమాట! – వాడికి అత్తవారివల్ల రాబోయే ఆస్తి ఎల్లానూ రాకుండాపోయిందని ఏదో రభస పెంచి వాడి బాధ్యత వాళ్ళ నెత్తిని రుద్దుదామనే ఆలోచనేమిటి?"

"నువ్వల్లాగంటావు కాని, అల్లుడు ప్రయోజకుడవాలని వాళ్ళకుమాత్రం వుండదటరా అన్నయ్యా" – అంటూ లోపలనుంచి వచ్చింది లక్ష్మీకాంతం.

"వుంటే వుద్ధరించమను!–" అన్నాడు రంగశాయి తీవ్రంగా.

"వాళ్ళే నాకు చదువు చెప్పించాలని నీవుద్దేశమైనట్టు ముందుగా తెలిస్తే యిన్నినాళ్లున్నించి" ముందుమాటకు అడుగుపెడుతూ వీధిలోనుంచి వచ్చాడు సుందరం."

"నువ్వింతలోనే తొందరపడ నక్కర్లేదు...మీ నాన్నకు యిల్లాంటి విషయాల్లో కావలసినంత ముందు చూపుంది.. ఏమంటావు బావా?" – అంటూ బావగారి ముఖంలో ప్రశ్నార్థకంగా చూశాడు శేషాచలం.

రంగశాయి మందహాసం చేశాడు. ★

## చెల్లాయికి ఉత్తరాలు

(35-వ పేజీ తరువాయి)

పోతున్నాడు (చెవుడు రాకముందు) రోడ్డుప్రక్కన ఒక మేడ, మేడ పక్కన ఒక పెంకుటిల్లు. పెంకుటింటిలోంచి బీథోవన్ రాసిన ఒక గీతాన్ని ఎవరో పియానో మీద వాయించటం వినిపిస్తోంది. అతిమధురంగా, లలితంగా వాయిస్తున్నారు. ఎవరా తన పాట వాయించేది అనుకుని బీథోవన్ స్నేహితునితోసహా ఆ యింట్లో ప్రవేశించాడు. ఇరవై ఏళ్ల పిల్ల పియానో ముందు కూర్చుని వాయిస్తున్నది. ఆమె సోదరుడు పాట వింటున్నాడు. ఇద్దరూ గుడ్డివాళ్లే. బీదవాళ్లవటంమూలాన పియానో పాతడొక్కు. పాటపూర్తయింది. "ఎక్కడ నేర్చుకున్నా విది?" అని అడిగాడు బీథోవన్. పక్క మేడలోని ధనవంతుల అమ్మాయి రోజూ ఒక మేష్టరు దగ్గిర సంగీతం నేర్చుకుంటోంది. మేడపక్కన నుంచుని విని ఈ పాటలు నేర్చుకున్నానన్నది గుడ్డిపిల్ల. సంగీతంమీద ఆ పిల్లకుగల ఆసక్తి చూసి బీథోవన్ సంతోషపరవశుడయ్యాడు. "అయితే ఇంకా మంచి సంగీతం వినిపిస్తా విను," అని డొక్కుపియానోముందు కూర్చుని ఆ అమ్మాయి వాయించిన పాటనే వాయించ సాగాడు. అతను బీథోవన్ అని ఆ అన్నాచెల్లెళ్లకి తెలియదు. పియానోపక్కనున్న కిటికీలోంచి పూర్ణిమచంద్రుడి వెన్నెల పియానోమెట్లమీద పడి నాట్యం చేస్తోంది. అది చూసి బీథోవన్ రసజగత్తుల్లోకి పోయాడు. తనేమివాయిస్తున్నదీ తనకే తెలియకుండా, ఇదివరకెప్పుడూ ఎవరూ విని ఎరగని ఫణితిలో వాయించ సాగాడు. బీథోవన్ వేళ్లు తగలగానే మోడైపోయిన చెట్టులాంటి ఆ డొక్కుపియానో సజీవమైంది. దాని వొళ్లు వొక్కసారిగా పులకరించి, చిత్ర విచిత్రమైన పోకడలతో ధ్వనించ సాగింది. పియానో మెట్ల మీద పడుతున్న చంద్రకాంతిని చూస్తూ వాయిస్తుంటే, దేవలోకం నుంచి అప్సరఃకన్యలు వెన్నెల దారుల్లోంచి వొయ్యారంగా వచ్చి పియానో మెట్లపై నాట్యం చేస్తున్నట్టనిపించిందట బీథోవన్ కు. ఆ అప్సరసలు అలా నాట్యం చేస్తుంటే దేవలోకంనుంచి మళ్లీ పిలుపు వస్తుంది. అప్సరసలు తమ ఆలస్యానికి భయపడి పరికిణీ కుచ్చెళ్లు పట్టుకుని కాళ్లగజ్జెలు ఘల్లుఘల్లుమంటుండగా తిరిగి వెన్నెల నిచ్చెనలెక్కి దేవలోకానికి మరలిపోతారు. కల అంతమౌతుంది. చటుక్కున పియానో ఆపేస్తాడు బీథోవన్. మధుర ప్రపంచంలోంచి తుళ్లి పడతారు ఆగదిలోవున్న ముగ్గురు శ్రోతలూ. గుడ్డిపిల్ల ఇలా అంటుంది: "ఇప్పుడు వాయించినది బీథోవన్ అయి వుండాలి." "అవును, నేనే" అంటూ బీథోవన్ గబగబ తనఇంటికి పరిగెత్తిపోతాడు. ఇప్పుడు తను వాయించిన పాట మరిచిపోతానేమోనని అతని భయం. కాగితం, కలం పుచ్చుకుని వెంటనే ఆపాట స్వరం యావత్తూ రాసేస్తాడు.

ఆరోజున ఆ పెంకుటింటిలో బీథోవన్ సృష్టించిన పాట అతని కృతులన్నిటిలోకీ గొప్పదని విమర్శకులంటారు. దానిపేరు "వెన్నెల పాట." ఇది తరవాత జగత్ప్రసిద్ధమైంది.

బీథోవన్ 1827 మార్చి 26 న చనిపోయాడు. అతడు చనిపోయినా అతని సంగీతం ఈనాటికీ ప్రపంచంలోని సంగీత కళాభిమానులకి ఆవేశం, ఉత్సాహం పురికొల్పుతూనే వుంది.

నీ అన్నయ్య,
—ఎన్నార్.

## తప్పెవరిది?

(17-వ పేజీ తరువాయి)

ఓండ్రలు ఒకటేమిటి 'జూ' లాగుంది ఆ రోజు పరీక్షల హాలు.

అందరినీ అణిచే శక్తిగల దూర్వాసుడి లాంటి సూపరవైజరొచ్చాడా వేళ. కేకలు వినగానే వినయపూర్వకంగా అల్లరి చేయవద్దని ఆజ్ఞాపించాడు.

అంతతో ఆపితే అసలు సిసలైనవిద్యార్థులౌతారా? కొంచెం స్థాయి ఎక్కువ చేశారు కూడాను.

ఆయన మాత్రం ఎలా ఓర్చుకో గలడు "బాబూ నేను విద్యార్థులకు పేపర్లిచ్చేందుకు వచ్చాను కాని గాడ్దెలకు గుర్రాలకూ కాదు" అన్నాడు.

ఇంటి పెద్దలె అంటే పడని ఈ కాలంలో అంత మాటవిని ఏ యువకరక్తం పొంగదు? అంతా లేచారు 'మూయవయ్యా నోరు' అంటూ!

చాపల బజారులా తయారైంది పరీక్షల హాలు. ఆ మాటన్నందుకు 'క్షమాపణ' కోరుకోమన్నారు విద్యార్థులంతా. ఆయన మాత్రం ఏం తక్కువ తిన్నాడని 'ససేమిరా వీలుకాదు. కావాలంటే రూములకెళ్లి పడుకోండి' అన్నాడు.

ఇంకేం కావాలి ఆయన నోటిగుండా ఆ మాట వచ్చిన తర్వాత? అంతా లేచి పోయి వంద మంది ఉండే ఆ క్లాసులో నలుగురు నిల్చారు. చదివి రాయగల వారు కూడా 'పదిమంది కలిసి అగ్గిలో దూకితే మనమూ అంతే' అని లేచిపోయారు. నిజానికి నిల్చిన ఆ నలుగురు, చక్కగా గాడ్దెల్లా

అరచగలిగారు. కాని ఇంతకంటె భస్టు మార్కు (ఏదయినా సరే!) తెచ్చుకుందుకు, వాళ్ల వినయ విధేయతలను నిరూపించుకుందుకు మరి సావకాశం? పైగా ఆ సూపరవైజరే ఈమాట ఒక పేపరుకు 'ఛీఫ్' ని వినికిడి కూడాను.

* * *

సంగతంతా విన్న ప్రిన్సిపాలుకు ఏంచేయాలో తోచలేదు. 'ఆయన క్షమాపణ చెప్తేగాని క్లాసుకురామంటారు' విద్యార్థులు 'నా తప్పేముంది గనుక. అలా వాళ్లు చేయొచ్చా? ఈ పరీక్షలు ఇలా జరగాల్సిందేనా ఎల్లకాలం? నిజానికి వీరిది ఈ తప్పు' అన్నాడు సూపరవైజరు.

ఎవరికి ఏం జవాబు చెప్పలేదు మరొకడైతే. కాని ధర్మరాజులాంటి మనిషి కాబట్టి నానాతంటాలు పడి, వాళ్ళచేత అల్లరి చేసినందుకు సూపరువైజరుకు, 'సూపరువైజరు' నోరు జారినందుకు విద్యార్థులకు ఒకేమాటు క్షమాపణ చెప్పించి ఇద్దరికళ్ల నీళ్లూ తుడిచాడు ఎలాగో!

వీళ్ళ ధర్మమా అని పరీక్షలే నిలిచేవారు ఆ కాలేజిలో. కాని విద్యార్థులదే తప్పని ఆయన సూపరువైజరుదే తప్పని విద్యార్థులు సాధించుకోటం మానలేదు కొన్నాళ్ళవరకు. ఇంతకూ తప్పెవరిదో? పాఠకులకే తెలియాలిగాని, ఒకరు చెప్తే వింటారా, వొరుకుంటారా? ★

## పల్లెటూరు పార్టీలు

(8-వ పేజీ తరువాయి)

పేడి. నీకోరోజులు దగ్గిరపడినట్టున్నాయిరా. (నిశాసం త్రిప్పుతూ) వీడెవడో తెలుసా మీకొంగలవాలిటు రంగడు.

సు: అనవసరంగా మాట్లాడితే మర్యాద దక్కదు, జాగ్రత్త.

రం: యేమిట్రా గాడిదకొడకా నీవల్లయేది... (పలుగుతో సుబ్బయ్య తలపై కొట్టును. సుబ్బయ్య అమ్మో అంటూ కూలబడిపోవును. తలపగిలి రక్తం కారుచుండును. రంగడు పారిపోవును. సుబ్బయ్య కేకవిని శాంతమ్మ ఆతృతగా యేడ్చుచూ ప్రవేశించును.)

శాం: (యేడుస్తూ) వాడిచేతులు విరిగిపోను. యేమొచ్చిందో వాడికిపోయేకాలం. అన్యాయంగా తలపగలగొట్టాడుగదా: యెంతఅన్యాయమైంజేను (నాలుగువైపుల నుండి పదిమంది పోగవుతారు. వారిలో నారాయణకూడా వుంటారు. శాంతమ్మ నారాయణను గాంచి)

శాం: చూశారా, మీరంతా వుండగానే యెంతఅన్యాయం జరిగిందో.

నా: ఎవడావాడు?

శాం: రంగడట. వాడికిరసెప్పుడు దేవుడు పగలగొడతాడో వాణ్ణెప్పుడు వల్లకాటికి కట్టికెళ్తారో...

నా: యెంతపగవుంటేమటుకు, యింత దారుణమ?

శాం: వొక్కర్ని వొక్కమాట అనేవారా, ఆడేవారా? అన్యాయంగా యిట్లా చావగొడుతుంటే చూస్తూవూరుకోవలసిందేనా?

రా: యేమిట్రాయిది (అంటూవస్తాడు)

శాం: రామయ్యనుచూచి బిగ్గరగా యేడుస్తూ) ఆ రంగడు యెంతపనిచేశాడో చూడు బాబాయ్.

రా: అరివెధవ, యేం పోయేకాలమొచ్చింది రావాడికి.

శాం: యిక మేం యీవూళ్లో బ్రతకలేం బాబాయ్.

రా: భయపడబోకమ్మా. వాడిసంగతి నే తెలుసుకుంటాగా?

నా: వడిబజార్లో పిలిపించక వొదిలిపెడతామా, వాడిని.

శాం: ఇక మూస్తతలైనా, తండ్రైనా మీరే.

రా: కేసుపట్టవమ్మా, వాడి తిక్క కొదిలిపోతుంది.

నా: కోర్టుద్వారా శిక్ష వేయించటమే మంచిది. ఇకమళ్ళీ రెండోనాటికి చెయ్యి చేసుకోలేడనుకో.

శాం: ఆడదాన్ని నావల్లేమవుతుంది. యీ భారమంతా మీదే. (యెవర్నూమాట్లాడరు)

శాం: (రామయ్యనుచూచి) యేం, బాబాయ్! నాకేం న్యాయం కలిగించరా. మాబోటివాళ్ళ గతి యింతేనా?

రా: నేనసలు యిటువంటి విషయాల్లో వూరుకో నేవాడినికాదు. కాని యిప్పుడు యలక్షన్ రోజులవటంమూలాన బలే చిక్కొచ్చింది. యీ రంగడి బంధువులంతా నాకే వోట్లిస్తామని మాటిచ్చారు. యిప్పుడు వీడివిషయంలో జోక్యం చేసుకుంటే యెట్లాగా అని తటపటాయిస్తున్నా.

శాం: (నారాయణవంక చూచి) మీరైనా దయతలచరా?

నా: అసలీ రంగడు నావాడే. వాళ్ళ బంధువుల వోట్లన్నీ పట్టిబట్టి నాకిప్పిస్తున్నాడు. అయినప్పుడు అనవసరంగా జోక్యంచేసుకుని, అవకాశాన్ని పాడుచేసుకుంటం యెట్లా కుదురుతుంది.

శాం: సలుగురికి చెప్పగలిగినవాళ్లు మీరే అట్లాఅంటే యిక మాగతియేంగాను? (యింతలో సుబ్బయ్య కళ్లుతెరచి మంచినీటికిగాను, నోటివద్ద చెయ్యిపెడతాడు.)

శాం: మంచినీళ్లు, మంచినీళ్లు, కాసిని తెచ్చిపెట్టండిబాబు (అక్కడున్నవారిలో వొకరు పరుగెత్తుకొనివెళ్ళి నీళ్లుతెస్తాడు. శాంతమ్మ అందుకుని నెమ్మదిగా నోట్లోపోస్తుంది. చల్లగా వొక్క గుటక మింగుతాడు.)

శాం: (యేడుస్తూ) అదుగో రామయ్యబాబాయి, నారాయణగార్లు మనల్ని నీటముంచుతారో పాలముంచుతారో అడుగు! (సుబ్బయ్య చేతులెత్తి నమస్కారం చేస్తాడు. తిరిగి కళ్లుమూతలుపడిపోతై.)

శాం: న్యాయాన్ని ఆలోచించండి బాబు. పార్టీలకంటె న్యాయం ఎక్కువైందికాదా నాయనా?

రా: న్యాయం, ఆలోచించేచెప్పాము.

శాం: యిదేనా, న్యాయం

నా: యెందుకుకాదు. మేమూ వుభయుల్ని సమానంగానే చూడదలిచాము.

రా: అంతే మీకెంతన్యాయం ఆలోచించారో మేమూఅంతే ఆలోచించాము. (అంటూ వెళ్లిపోతారు)

శాం: అహాహా, యేమిఖర్మం. (గ్రామపెద్దలు. తీర్పులివ్వలతో గొంతులుకొయ్యటమే మీ న్యాయపరిపాలన. అబ్బా, యెంతఘోరం, యెంతఘోరం (అంటూ వొరిగిపోవును.) ★

## స్వీకారం

జాబిల్లి

నవల; రచయిత: శ్రీ అడివిబాపిరాజు; 'ఆంధ్రమహిళ' ప్రచురణలు; దొరికేచోటు: ఆంధ్రమహిళ కార్యాలయము. 14, ద్వారక, మైలాపూరు, మదరాసు-4; వెల 1-8-0

గెలుపు సేదే:

నాటకం; కర్త; కె. ఎల్. నరసింహారావు; వెల 1-0-0; దొరికేచోటు: సంగీతసమితి గన్ఫౌండ్రి, హైదరాబాదు.

[illegible]

మద్రాసు ప్రభుత్వ గ్రామజనాభ్యుదయ శాఖవారిచే ప్రచురింపబడుతున్న సౌభాగ్య పత్రిక వార్షికసంచిక జనవరినెలలో వెలువడినది; విడివెల 0-8-0 చక్కని కథలు, వ్యాసాలున్నాయి

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St.. Mad s.

Regd No. M. 4479

త్వరలో విడుదల!

త్వరలో విడుదల!




డిస్ట్రిబ్యూటర్స్: ఆంధ్ర, సీడెడ్, జిల్లాలకు: నవయుగఫిల్మ్స్. విజయవాడ.

నైజాంస్టేటుకు: ప్రీమియర్ పిక్చర్సు. సికింద్రాబాద్.